ప్రపంచ తెలుగు మహాసభ ప్రచురణ

# తెలుగు-ఉత్తర భారత సాహిత్యాలు




రచయితలు

డా. భీమసేన్ నిర్మల్

శ్రీ ఇరువెంటి కృష్ణమూర్తి





ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాద్

హైదరాబాదు

# ముందుమాట

ఎన్నో ఏళ్ళుగా అనుకొంటున్న ప్రపంచ తెలుగు మహాసభలు జరుగనున్న పర్వసమయం ఆసన్నమవుతున్నది. ప్రపంచంలోని తెలుగువారి ప్రతినిధు లందరిని ఒకచోట సమీకరించవలెనని పెద్ద లందరూ కన్నకలలు ఫలిస్తున్న శుభసమయమిది. రాబోయే ఉగాది రెండువేల అయిదువందల సంవత్సరాల తెలుగు జాతి చరిత్రలో మరపురాని మధుర ఘట్టము కాగలదు.

క్రీస్తు పూర్వం మూడవ శతాబ్దికి చెందిన శాతవాహన రాజుల కాలం నుండి తెలుగు ప్రజలకు ఒక విశిష్టమైన చరిత్ర ఉన్నది. భారత దేశంలో తెలుగు మాట్లాడే ప్రజలు దాదాపు ఐదుకోట్లకు పైగా ఉన్నారు. హిందీ మాట్లాడేవారి తరువాతి స్థానం తెలుగువారిదే. బౌద్ధపూర్వ యుగంనుంచి ఇటీవల బ్రిటిష్ సామ్రాజ్య పరిపాలనాయుగం వరకూ తెలుగువారు పెద్దఎత్తున ప్రపంచం నలుమూలలకూ వలస వెళ్ళడం జరిగింది. అట్లా వెళ్ళిన తెలుగువారు తమ భాషా సంస్కృతి సంప్రదాయాలను ఆయా జాతీయ జీవన విధానాలతో మేళవించి, వాటిని సుసంపన్నం చేస్తూ ఉన్నారు.

ప్రపంచ తెలుగు మహాసభల ప్రధాన లక్ష్యం తెలుగు ప్రజల, తెలుగు అభిమానుల ప్రతినిధులను ఒక వేదికమీద సమావేశపర్చడం. జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక రంగాలలో తెలుగువారు చేయవలసిన కృషినిగూర్చి చర్చించి, నిర్ణయించుకోవడానికీ, తద్వారా వివిధ చైతన్య స్రవంతులను ఏకోన్ముఖంచేసి మన సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేసుకోవడానికి ఈ మహాసభలు దోహద కారులు అవుతవి. అంతేకాక ఈ మహాసభలు ఆర్ద్రమైన భావసమైక్యతకు ప్రాతిపదికలై తెలుగుజాతిని సమైక్యం చేయగలవనీ, ఆ విధంగా జాతీయ అభ్యుదయానికి తోడ్పడగలవనీ విశ్వసిస్తున్నాను.

1975 ఏప్రిల్ 12వ తేదీన, తెలుగు ఉగాది రోజున, ప్రారంభమై ఒక వారం రోజుల పాటు జరిగే ఈ మహాసభలలో వివిధ దేశాలనుంచీ, వివిధ రాష్ట్రాలనుంచీ, యునెస్కోవంటి అంతర్జాతీయ సంస్థలనుంచి విచ్చేసిన ప్రముఖులు ప్రతినిధులుగానో, పరిశీలకులుగానో పాల్గొంటారు.

ఈ మహాసభల సమయంలో చర్చాగోష్ఠులు, ప్రదర్శనలు, ప్రచురణలు మొదలైన కార్యక్రమాలు జరుగుతాయి. దేశ విదేశాలలోని తెలుగువారి సంస్కృతి, తెలుగు భాషా సాహిత్యాల కళల అభివృద్ధి, వైజ్ఞానిక సాంకేతిక ప్రగతి మొదలైన విషయాలపై చర్చాగోష్ఠులు జరుగుతవి తెలుగువారి సాంస్కృతిక వైభవాన్ని వివిధ కోణాలనుంచి ప్రస్ఫుటం చేసే ఒక ప్రదర్శన ఏర్పాటు అవుతున్నది తెలుగువారి సమగ్ర స్వరూపాన్ని సందర్శించడానికి వీలైన సంగ్రహాలయాన్ని (మ్యూజియంను) స్థాపించడానికి ఈ ప్రదర్శన బీజ భూతమవుతుంది తెలుగువారి సంస్కృతిని నిరూపించే సాంస్కృతిక కార్యక్రమాలు వారం రోజుల పాటు సాగుతవి తెలుగు ప్రజల సంస్కృతి సంప్రదాయాలను విశదం చేసే ప్రత్యేక సంచికలు తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఉర్దూ భాషలలో విడుదల అవుతాయి ఈ కార్యక్రమాలలో భాగమే ఈ గ్రంథ ప్రచురణ.

తెలుగు ప్రజలు భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి. కళలు మొదలైన వివిధ రంగాలలో సాధించిన ఘనవిజయాలను విశదం చేసే గ్రంథాలు అనేకం ఈ మహాసభల సమయంలో విడుదల అవుతాయి ఈ గ్రంథాలను రచించి, సకాలంలో మాకు అందించిన రచయితలందరకూ నా కృతజ్ఞతలు. ఈ గ్రంథాలను ప్రచురించే భారం వహించడానికి ముందుకువచ్చిన అకాడమీ అధినేతలను అభినందిస్తున్నాను. తెలుగువారి విశిష్టతలను విశదంచేసే ఈ గ్రంథాలు సహృదయులందరి ఆదరణ పొందగలవని విశ్వసిస్తున్నాను అయితే, ఇంత మాత్రం చేతనే ప్రపంచ తెలుగు మహాసభల ఆశయాలు సఫలం కాగలవని నేను అనుకోవడంలేదు. చేయవలసినది ఇంకా ఎంతో ఉంది. ఈ మహాసభల సందర్భంగా నెలకొల్పబడనున్న 'అంతర్జాతీయ తెలుగు విజ్ఞాన సంస్థ' మహాసభల ఆశయ సాధనకు పూనుకొనడమే కాక జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేయగలదని నమ్ముతున్నాను.

జలగం వెంగళరావు
అధ్యక్షులు
ప్రపంచ తెలుగు మహాసభలు

# పరిచయము

సహస్రాబ్దాలుగా ప్రవర్ధమానమగుచున్న తెలుగు సంస్కృతిని తెలుగుదేశపు నలుచెరగుల పరిచితము చేయు సంకల్పముతో 1975 వ సంవత్సరమును తెలుగు సాంస్కృతిక సంవత్సరముగ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ప్రకటించినది అందుకు అనుగుణమైన కార్యక్రమాలను నిర్వహింపజేయుటయేగాక, ప్రపంచములోని వివిధ దేశాలలో నివసించుచున్న తెలుగువారి సాంస్కృతిక ప్రతినిధులందరును ఒకచోట సమావేశమగు వసతిని కల్పించుటకై 1975, ఏప్రిల్ 12 (తెలుగు ఉగాది) మొదలుగ ప్రపంచ తెలుగు మహాసభ హైదరాబాదున జరుగునటుల ప్రభుత్వము నిర్ణయించినది అందుకు ఒక ఆహ్వానసంఘము ఏర్పాటైనది ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముఖ్యమంత్రి మాన్యశ్రీ జలగం వెంగళరావుగారు ఆ సంఘమునకు అధ్యక్షులు, విద్యాశాఖామంత్రి మాన్యశ్రీ మండలి వెంకటకృష్ణారావుగారు దాని కార్యనిర్వాహకాధ్యక్షులు, ఆర్థికమంత్రి మాన్యశ్రీ పిడతల రంగారెడ్డిగారు ఆర్థిక, సంస్థా కార్యక్రమాల సమన్వయసంఘాల అధ్యక్షులు

ఆ సంఘము, ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున వచ్చువారికి తెలుగుజాతి సాంస్కృతిక వైభవమును తెలియజేయుటకు అనువుగ ఆంధ్ర భాషా, సాహిత్య, కళా, చరిత్రాదికములను గురించి ఉత్తమములు, ప్రామాణికములునగు కొన్ని లఘు గ్రంథములను ప్రకటించవలెనని సంకల్పించి, ఆ కార్యనిర్వాహణకై 44 మంది సభ్యులుకల ఒక విద్వత్‌సంఘమును, శ్రీ నూకల నరోత్తమరెడ్డిగారి అధ్యక్షతన నియమించినది ఆ విద్వత్‌సంఘము ఆ లఘు గ్రంథముల వస్తువుల నిర్దేశించి వాని రచనకై ఆయారంగములందు పేరుగనిన ప్రముఖులను రచయితలుగ యెన్నుకొనినది. ఈ విధముగ సిద్ధమైన గ్రంథములలో భాషా, సాహిత్య, చారిత్రక విషయములకు సంబంధించిన వానిని ప్రకటించు బాధ్యతను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వహింప

వలసినదిగ ప్రపంచ తెలుగుమహాసభా కార్యనిర్వాహకాధ్యక్షులు మాన్యశ్రీ మండలి వెంకటకృష్ణారావుగారు అకాడమీని కోరిరి. మహాసభా సఫలత కొరకై కృషిచేయు సంకల్పముతో ఈ బాధ్యతమ వహించుటకు అకాడమీ సంతోషముతో అంగీకరించినది.

ఆ విధముగ ప్రకటింపబడిన గ్రంథశ్రేణిలో ఈ **తెలుగు-ఉత్తర భారత సాహిత్యాలు** అను గ్రంథమును, రచించిన డా. భీమసేన్ నిర్మల్, శ్రీ ఇరువెంటి కృష్ణమూర్తి ఆంధ్ర పాఠకలోకమునకు సుపరిచితులు. వారికి మేము కృతజ్ఞతాబద్ధులము గ్రంథమును నిర్దుష్టముగ, చక్కగ ముద్రించిన శివాజీ ప్రెస్ వారికి మా కృతజ్ఞత

**దేవులపల్లి రామానుజరావు**
*కార్యదర్శి*
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

హైదరాబాదు
19-3-1975

# తెలుగు - ఉత్తర భారత సాహిత్యాలు

# I

జనం విభ్రతీ బహుధా వివాచసం నానాధర్మాణం పృధ్వీయధౌకసమ్ ।
సహస్రం ధారా ద్రవిణస్య మే దుహాం ధ్రువేవ ధేనురనపస్ఫురంతీ ॥

(అ కా 120 సూ 1 గం 45)

ప్రాచీనకాలంలోని కవులకు తమతమ కావ్యాలలో భరతఖండంలో ఉండే ఛప్పన్న దేశాలనుగురించి అడపాదడపా ప్రస్తావించడం పరిపాటిగా ఉండేది మహారాజుల పట్టాభిషేక సమయంలోనో లేక వారి యుద్ధసంరంభ సందర్భంలోనో వారు ఆయా దేశాల రాజులు వచ్చారని వర్ణించడం కద్దు అంటే ఆ రోజుల్లో భారతదేశం 56 రాజ్యాలుగా విభక్తమై ఉండేదన్నమాట ఈ రాజ్యాలన్నీ సర్వ స్వతంత్రమైన రాచరికం కలిగి ఉండేవి అయితే బలశాలి అయిన ఎవరో ఒకరాజు అశ్వమేధమో, దిగ్విజయమో చేసి చక్రవర్తి ననిపించుకునేవాడు ఆ చక్రవర్తిత్వం కూడా తాత్కాలికమైందిగానో, నామమాత్రంగానో ఉండేది

కాని రాజకీయంగా సమస్తదేశం ఈ విధంగా విభక్తమై ఉన్నా, సాంస్కృతికంగా అవిభక్తంగా ఉండేది. సంస్కృతి, మతం, వాఙ్మయం మొదలయిన రంగాలలో మనదేశం అవిభక్తంగా ఉండేదనడానికి ఆధారాలు చాలా కనిపిస్తున్నవి. పుణ్యనదులు, పుణ్యతీర్థాలు, మతపీఠాలు మొదలయినవి దేశం నలుమూలలా వ్యాపించి ఉండి, దేశాన్ని ఏకసూత్ర నిబద్ధం చేశాయి కాశీ గంగా జలాన్ని రామేశ్వరంవద్ద సాగరంలో కలిపి, రామేశ్వరంలోని ఇసకను కాశీ గంగలో కలిపితేనే యాత్ర పరిపూర్ణమవుతుందనే విశ్వాసం దేశసమైక్య భావాన్ని నిరూపించేదే. ఆదికవి శ్రీరాముడి శీలాన్ని వర్ణిస్తూ

> సచ సర్వగుణోపేతః కౌసల్యానందవర్ధనః
> సముద్ర ఇవగాంభీర్యే ధైర్యేణ హిమవానివ ।

(బా. ప్రథమసర్గ. శ్లో 17)

అని అతని గాంభీర్యాన్ని సముద్రంతోను, ధైర్యాన్ని హిమాలయంతోను పోల్చి, దేశసమగ్ర స్వరూపాన్ని వ్యంగ్యంగా సూచించాడు. ఒక వ్యక్తి శీలాన్ని వర్ణించడంలో దేశానికి దక్షిణాన ఉన్న సముద్రాన్ని, ఉత్తరాన ఉన్న హిమాలయాలను ఉట్టంకించడం, ఈ సమస్తదేశం ఒకటేనని, అఖండమని [illegible]ంచడమే.

ఇలా వ్యంజనారూపంలో కాకుండా, సమస్తదేశాన్ని వర్ణించిన ప్రసంగాలు సంస్కృత సాహిత్యంలో కోకొల్లలు

ఈ భావాన్నే విశదీకరిస్తూ డాక్టరు పరమాత్మశరణ్, [ఎం ఏ , పిహెచ్. డి , ఎఫ్ ఆర్ హెచ్ ఎస్ (లండను)], ఇలా అన్నారు

'సమైక్యం ఆధారంగా వికసించిన వైవిధ్యాన్ని, అనేకత్వాన్ని గుర్తించిన మహనీయులు ప్రాచీన భారతీయులు. మానవస్వభావ సూచకమైన ఈ యాధార్థ్యాన్ని ప్రప్రథమంగా అవగాహన చేసుకున్నది కూడా భారతీయులే విశిష్టమైన ఈ సమైక్య భావాన్ని భారతీయులే పెంపొందించుకున్నారు. ఇది వారి ప్రత్యేకత '[1]

బాహిరంగా కనిపించే విభిన్న లక్షణాల వెనక ఆంతరంగికంగా నిక్షిప్తమై ఉన్న ఏకత్వం, అభిన్నత విదేశీయులకు ఆశ్చర్యాన్ని కలిగించవచ్చును ఈ విషయాన్ని ఉట్టంకిస్తూ పండిత జవాహర్‌లాల్ నెహ్రూగారు ఇలా వ్రాశారు :

'and yet underneath all this there is an Indianness which distinguishes every part of India and is something unique and deeper than the external differences that may strike the casual observer India is a curious mixture of amazing diversity and abiding unity '[2]

(భారతదేశంలోని ప్రత్యంశంలోనూ, నిక్షిప్తంగా ఉన్న విలక్షణ భారతీయత్వం, సామాన్యుడికి కొట్టవస్తున్నట్లు కనిపిస్తున్న బాహిరభేదాలకంటే ప్రగాఢ

---

1 'The basic truth of the nature of human society which was from the very first realised by these ancients was the recognition of diversity and multiplicity both flourishing on the bed-rock of an underlying unity, a unique oneness which has been characteristic of the Indian people since ages unknown.'

'The Preservation and Strengthening of the cultural Synthesis Effected in India Since Medieval Times' (p-5)-National Integration Phblication Series I. published by The Institute of Indo-Middle East cultural studies, Hyderabad-1967.

2. As quoted by Dr P. Saran in his essay. p. 7.

మైనదీ, విశిష్టమైనదీ ఆశ్చర్యకరమైన వైవిధ్యాల విచిత్ర సమ్మేళనాన్ని, ప్రకృష్టమైన సమైక్య స్ఫూర్తిని భారతదేశం ప్రదర్శిస్తుంది )

సాంస్కృతికంగాను, మతపరంగాను అభివ్యక్తమయిన సమైక్య దృక్కోణం భారతీయ వాఙ్మయంలో, అనేక రూపాలలో మనకు సాక్షాత్కరిస్తుంది.

సంకుచిత మనస్తత్వానికి స్వస్తిచెప్పిన మనీషు లెందరో తమకు అనేక భాషలలో అభినివేశం ఉందని, ఆయాభాషలలో తమకున్న పాండితీగరిమ తమకు గర్వకారణమని చెప్పుకున్నారు

హిందీభాషకు అదికవి అయిన చంద్ బర్దాయి 'పృథ్వీరాజ్ రాసో' అనే మహాకావ్యంలో తనని గురించి వ్రాసుకుంటూ, తాను 'షట్ భాషా' ప్రవీణుణ్ణని చెప్పుకున్నాడు [1] అదేవిధంగా వాగనుశాసనుడయిన నన్నయభట్టారకుడు తన సహాధ్యాయి అయిన నారాయణభట్టు సంస్కృత, ప్రాకృత, పైశాచిక, ఆంధ్ర, కర్ణాట భాషా కవిరాజ శేఖరుడని వ్రాశాడు [2] శ్రీనాధుడు, తెనాలి రామకృష్ణకవి మొదలయినవారు తాము ఎన్నెన్నో భాషలలో ప్రవీణులమని వ్రాసుకున్నారు. దగ్గుపల్లి దుగ్గన శ్రీనాధుణ్ణి 'సంస్కృత ప్రాకృత శౌరసేనీ ముఖ్యభాషాపరిజ్ఞాన పాటవంబు'[3] కలవాడని కొనియాడాడు భీమఖండ కృతిపతి అయిన బెండపూడి అన్నమంత్రి అరబీ భాష, తురుష్కభాషలందు ప్రవీణుడనీ, పారసీలో వ్యవహారం కొనసాగించడానికి సామర్థ్యం కలవాడని శ్రీనాధుడు వర్ణించాడు.[4] పొన్నికంటి తెలగనార్యుడు తన కృతిభర్త అయిన అమీన్‌ఖాను సంతానంలో గతాల్ ఖాను అనునతడు అరబీ, పారశీ, గుజరాతి, ఆరె, అచ్చతెనుగు, కన్నోజి మొదలయిన భాషలు తెలిసి, వ్రాయగలిగినవాడని వర్ణించినాడు [5]

అనేక భాషలు నేర్చుకొని, పరభాషాసహనం కలిగి ఉండడం ఆనాటి కవి పండితుల విశిష్ట లక్షణమని నిస్సందేహంగా చెప్పవచ్చును. కవి పండితుల మాట

---

1. 'ఉక్తి ధర్మ విశాలస్య రాజనీతి నవంరసం ।
 షట్ భాషాపురాణం చ కురానం కథితంమయా ॥ (సమయ I - రూపకం 38).
2. నందంపూడిశాసనం.
3. నాసికేతోపాఖ్యానము.
4. భీమఖండం. 1-72, 74
5. యయాతి చరిత. 1-41

కేమి, సామాన్య ప్రజానీకమూ, ఆనాడు బహుభాషాభినివేశం, బహుభాషా ప్రియత్వం, సమగ్ర వ్యక్తిత్వానికి చిహ్నమని, అలంకార ప్రాయపని భావించేది. చతుష్షష్టికళలలో అన్యభాషా పరిచయం కూడా ఒకకళగా వన్నెకెక్కింది ఉదాహరణకు పాల్కురికి సోమనాథుని (12వ శతాబ్దం) 'వృషాధిప శతకం'లో మణిప్రవాళ శైలిలో రచించబడిన కొన్ని పద్యాలు మచ్చుకు ఉట్టంకిస్తాము.

ఉ. 'హృన్నలినే స్మరామి భవదీయ పదద్వితయం భవాటన
స్విన్న తమశ్రమాపహ మశేష జగత్ప్రణుతం మదీశ ని
ష్పన్న దయానిధే యనుచు, సంస్కృత భాష నుతింతు నిన్ను వి
ద్వన్నుత నామధేయ బసవా! బసవా! బసవా! వృషాధిపా.

చ. పరమనె యెన్న యీండవనె పన్నుదయానె యనాదనాదనే
పెరియనె పేరివుండవనె, పేరుదయాయనె, పేరుజెప్పనే
తరిమురి యాయనే యనుచు ద్రావిడ భాష నుతింతు నిన్ను మ
ద్వర కరుణా విధేయ బసవా! ... ... ... ...

చ. హసుశెయరెన్న రక్షిసువు దారయవెన్న వనీత నెందు మ
న్నిసువుదు నిమ్మడింగెరగ నిమ్మప్రసాదియె నిమ్మదాత్మనే
కసిగతి యంచు భక్తి నిను గన్నడభాష నుతింతు షడ్గుణ
శ్వసన పురాతనాత్మ బసవా! ... ... ... ...

ఉ. దేవపరీతుష్మీచ గురుదేవమణూను తరీతుష్మీచ గో
సా వితరీతుష్మీ చ తుమచాచ ప్రసాదచష్మీ కృపాకర
హేవరదా యటంచు నుతియించెద నిన్నును నారెభాస దే
వా వినుతార్య లీల బసవా! ... ... ... ...

చ. అనయము జేతులందు భవదంఘ్రి సరోజ యుగం నమామి నె
మ్మనమున సంస్మరామి యను మాటల నిన్ వరివస్కరోమ్యహ
మ్మనుచు మణిప్రవాళమున నంకన సేయుదు భక్తలోక హృ
ద్వనజ విహారలోల బసవా! ... ... ... ...

(భక్తిరస శతకసంపుటము : వావిళ్ళరామస్వామి శాస్త్రులు అండ్‌సన్స్, 1926)

ఇతర భాషలను నేర్చుకొని ఉండడం, యథానుకూలంగా వాటిని తమ కావ్యరచనకు ఉపయోగించుకోవడమే కాకుండా, ఇతరభాషల వైశిష్ట్యాన్ని, మాధుర్యాన్ని కూడా అనాటివారు కంఠోక్తిగా ప్రశంసించేవారు తమిళం మాతృభాషగా కలిగి, సంస్కృతంలో సుప్రసిద్ధ పండితుడు, రచయిత అయిన అప్పయ్య దీక్షితులు ఆంధ్రత్వాన్ని, ఆంధ్రభాషా గౌరవాన్ని అద్వితీయంగా పొగిడారు [1] అవి ఆనాటివారికి ఇతర భాషాసాహిత్యాల పట్లగల సమాదర భావాన్ని సూచిస్తుంది.

ఈ విధంగా ఇతర భాషలపట్లను, ఇతరుల ఆచారవ్యవహారాలపట్లను, నాటి భారతీయులు పెంపొందించుకున్న సౌహార్దభావమే, వారిని సాంస్కృతికంగా ఒకే దేశ ప్రజలుగా తీర్చి దిద్దగలిగింది. నాటి ప్రజాజీవితాన్ని మతసంస్కృతులు తీర్చి దిద్దినట్లుగా, రాజకీయాలు తీర్చి దిద్దలేకపోయినవి. రాజకీయ వ్యవహారం హృదయాలను విడదీస్తుంది, సాహిత్యం ప్రజాహృదయాలను సమీకరిస్తుందనే యాథార్థ్యానికి భారతీయ ఇతిహాసం సాక్షీభూతం'.

ఈ విధమైన సుహృద్భావ వాతావరణంలో మనదేశంలోని ఎన్నో భాషలు సాహితీ మర్యాదలను సంతరించుకొనగలిగినవి. అయితే ఈ భాషల్లో చాలామటుకు సంస్కృత భాషా-సాహిత్యాలు ఆధారంగా వికసించినవే అనాటి విద్వాంసులు సంస్కృతభాషా-సాహిత్యాలలో పారంగతులయి, ఆ విజ్ఞానాన్ని ప్రాంతీయభాషల ద్వారా ప్రజానీకానికి అందిస్తూ ఉండేవారు భారతీయ భాషలన్నింటిలోను వ్యాకరణం, సాహిత్యశాస్త్రం-రెండూ సంస్కృతం ఆధారంగా ఏర్పడ్డవే సాహిత్యశాస్త్రమయితే, ఏ భాషలోను మౌలికంగా ఇప్పటికీ లేనేలేదు వాఙ్మయ వికాసానికి సంస్కృతరచనలే మూలకందాలు. ఇలా భారతీయభాషా-సాహిత్యాలన్నిటిని ఏక సూత్రబద్ధం చేసిన గౌరవం సంస్కృతానికే దక్కింది. సాహితీబంధువులయిన డా బెజవాడగోపాలరెడ్డిగారు అన్నట్లు 'భారతీయభాషలన్నీ, వివిధవర్ణాలతో విలసిల్లుతున్న కమనీయకుసుమాలు. వాటినన్నింటిని హారంగా తయారుచేసింది సంస్కృతసూత్రం. హారం తయారయిన తరవాత దారం మన కంటికి కనిపించదు. అదేవిధంగా భారతీయ సాహిత్యంలో సంస్కృతం అంతర్వాహినిగా ఉన్నదనడంలో ఏ మాత్రం సందేహంలేదు.

అయితే సంస్కృతసాహిత్యాన్ని సుసంపన్నం చేయడంలో వ రూపీరనక

1. 'ఆంధ్రత్వ మాంధ్రభాషాచ నాల్పస్యతపసః ఫలమ్'.

సమస్త భాషలవారు సహకరించారు. ఈ విషయంలో తెలుగువారు ఎవరికీ తీసి పోలేదు.

ద్రవిడ భాషా కుటుంబానికి చెందిన తెలుగుభాష తన సోదరభాషలకంటే, ఆర్యభాషాకుటుంబానికిచెందిన సంస్కృత-ప్రాకృతభాషా ప్రమేయంతో ఎక్కువ ప్రభావితమయింది. తెలుగు ఆ భాషల ప్రభావం ఎంతగా అలవరచుకుందంటే, కొంతమంది విద్వాంసులకు తెలుగు సంస్కృత-ప్రాకృతజన్యమనే అభిప్రాయం కూడ ఏర్పడింది. కాని సంస్కృత-ప్రాకృత శబ్దజాలాన్ని గ్రహించినా, ఆర్య భాషా సంప్రదాయాలను సంతరించుకున్నా, తెలుగు తన మూలభాషా సంప్రదాయా లను, ధ్వని వైలక్షణ్యాలను నిలుపుకుంటూ, తన స్వతంత్ర ప్రతిపత్తికి భంగం కలగకుండా చేసుకోగలిగింది

ఆర్యభాషా సంస్కృతులతో అవినాభావ సంబంధం ఏర్పరచుకున్న ఆంధ్రులు ప్రాకృత-సంస్కృత భాషాసాహిత్యాలకు ఎనలేనిసేవచేశారు. బ్రహ్మ సూత్రాలకు భాష్యం వ్రాయడం దగ్గరనుండి, చాటు-ముక్తక-పద్యరచన వరకు వారు తమ ప్రతిభావ్యుత్పత్తులను నిరూపించుకున్నారు కొన్ని వాఙ్మయ శాఖలలో తెలుగువారి రచనలకు మూర్ధన్య గౌరవం లభించింది. వైదికవిజ్ఞానంలో విద్యారణ్య స్వామి, సూత్రకారులలో ఆపస్తంబుడు, దర్శన వాఙ్మయంలో కుమారిలభట్టు, వ్యాఖ్యారచనలో మల్లినాథసూరి, కావ్యశాస్త్రంలో పండితజగన్నాథుడు, మాధ్యమిక వాద ప్రతి పాదకుడయిన నాగార్జునుడు, గీతగోవిందంతో సరితూగగల శ్రీకృష్ణ లీలాతరంగిణి కర్త నారాయణ తీర్థులు, తెలుగువారి గీర్వాణభాషా ప్రావీణ్యానికి వైజయంతికలు.

ప్రాకృత-అపభ్రంశ భాషలలో రచనలుచేసిన ఆంధ్రులు పలువురు ఉన్నారు. హాలసాతవాహనుని గాథాసప్తశతి ఉత్తరభారత వాఙ్మయరంగంలో-ముఖ్యంగా హిందీలో-అతి ప్రసిద్ధమయిన 'సతసయీ' పరంపరకు మూలమని చెప్పడంలోను, గుణాఢ్య విరచితమయిన బృహత్కథ భారతీయ భాషలన్నింటి లోను కావ్య-నాటకాదులకు ఉపజీవ్యమైన రచన అని చెప్పడంలో ఎటువంటి అతిశ యోక్తిలేదు.

హిందీభాషలో స్వయంగా రచనాకార్యం సాగించకపోయినా, భక్తియుగంలో (15-16 శతాబ్దాలు) కృష్ణభక్తిశాఖను ప్రవర్తిల్లచేసింది వల్లభాచార్యులు. ఆయనది

కంభంపాటివంశం జననం కాకరవాడ (పాడు) ఆయన ఉత్తరభారతదేశంలోని మధురలో నివాసం ఏర్పరచుకొని, భక్తిమార్గంలో పుష్టిసంప్రదాయాన్ని ప్రవేశ పెట్టారు. ఆసంప్రదాయంలో దీక్షితులయి, తమ రచనలతో భక్తరసికులను అమందా నంద సాగరంలో ఓలలాడించిన వారే సూరదాసు, నందదాసు ప్రభృతులు. హిందీ కావ్య జగత్తుకు ఇలాంటి అనర్ఘరత్నాలను ప్రసాదించిన గౌరవం తెలుగువానికే దక్కింది వల్లభాచార్యుల కుమారుడయిన గోస్వామి విఠలనాథుడు వ్రజభాషలో గద్యరచనకు మూలప్రేరకుడయినాడు హిందీసాహిత్యంలో 'రీతికాలమని' (17-18 శతాబ్దాలు) ప్రసిద్ధి చెందిన శృంగారయుగంలో పద్మాకరభట్టు (1753-1833), లాల్‌కవి అనుపేరిట ప్రఖ్యాతుడయిన గోరేలాల్ (1658-1710) మొదలయిన ఆంధ్రులరచనలు తెలుగువారికి గర్వకారణాలుగా విలసిల్లుతున్నవి

ఈ విధంగా సాంస్కృతికంగా ఒక్కటే అయినా, భాషాభేదాలవల్ల ఏర్పడిన భిన్నత్వం ఎందాకాపోయిందంటే, విదేశీయులు ఈ దేశం ఒకటికాదు, మహాఖండం అనేదాకా వచ్చింది భారతీయభాషలన్నింటికి అంతస్సూత్రంగా ఉన్న సంస్కృ తానికి రాజకీయ కారణాలవల్ల ప్రాముఖ్యం తగ్గింది దాని స్థానాన్ని ఇంగ్లీషు ఆక్ర మించింది. కాని ఇంగ్లీషు ఏ కొద్దిమందికో అలవడడంవల్ల అది భారతీయుల హృదయ భాష కాలేకపోయింది భారతీయ సాహిత్యాలలో ఏ విధమైన మార్పులు వస్తున్నాయో, ఏఏ ఉద్యమాలు తలలెత్తుతున్నాయో, అందరికి తెలియరాని పరిస్థితి ఏర్పడింది ఈ పరిస్థితివల్ల ఒకనాడు ఒకే మాలలోని కుసుమాలుగాఉన్న ఈ భాషలు ఈనాడు విదేశీయ భాషలేమో నన్నంత భ్రమ కలుగుతున్నది. రాజకీయ స్వాతంత్ర్యం లభించిన తరవాతకూడా ఈ భ్రమను తొలగించే ప్రయత్నం సకృత్తుగానే జరుగుతున్నదని చెప్పవలసివస్తున్నది.

తెలుగుభాషను ప్రభావితంచేసిన ఆధునికభాషలు రాజకీయకారణంగా ఉర్దూ-హిందీ భాషలయితే, సాహిత్యపరంగా ప్రభావితంచేసిన భాషలు బెంగాలీ-మరాఠీలు అని చెప్పవచ్చును. ఒక సజీవమైన భాష తన పదకోశాన్ని ఇతర భాషాపదాలతో సమృద్ధం చేసుకుంటూ ఉంటుంది. ఉత్తర భారతీయభాషలలో ఉర్దూ-హిందీలనుండి తెలుగులోకివచ్చిన పదాలసంఖ్య చాలా అధికమని చెప్పవచ్చును. అయితే ఇతర భాషల ఉత్కృష్ట సాహిత్యాన్ని అనువాదం చేసుకొని, ఆ అనువాదాలవల్ల ప్రభా వితం కావడం ఒక అంశం, ఆయా భాషలు నేర్చుకొని, ఆయా భాషలలో రచనలు సాగించి, ఆయా సాహిత్య జగత్తులలో పేరుగడించడం మరో అంశం. బహుళ

సంస్కృత-ప్రాకృతాల తరవాత హిందీభాషలోనే చాలామంది ఆంధ్రులు రచనలు చేసి ప్రసిద్ధి చెందారు తెలుగుపై ఇతర ఉత్తర భారతీయ భాషల ప్రభావం ఏమాత్రం లేదనే చెప్పాలి

భారతీయ భాష లన్నింటిలో వచ్చిన సాహిత్యాన్ని స్థాలీపులాకంగా పరిశీలిస్తే, ఈ క్రింది లక్షణాలు సమానంగా కనిపిస్తవి ఆధునిక భారతీయ భాష లన్నింటిలోను వాఙ్మయరచన దాదాపు 10-11 శతాబ్దులలోనే ప్రారంభ మయింది. ఆరంభదశలో రామాయణ, మహాభారత, భాగవతాలు, పురాణాలు మొదలయిన సంస్కృత రచనల ప్రభావం, ఆ తరవాత క్రమంగా ఇస్లాం ప్రభావం, పాశ్చాత్య సంస్కృతి ప్రభావం - ఈ క్రమం అన్ని భాషా సాహిత్యాల మీద సమానంగా — కొంచెం ముందు వెనకలుగా - కనిపిస్తుంది. 19వ శతాబ్దంలో పాశ్చాత్య సంస్కృతి సాహిత్యాల సంబంధంతో - పునర్జాగరణ కాలంలో - సాంస్కృతిక ఆధ్యాత్మవాదం సంఘసంస్కరణోద్యమం, కాల్పనికోద్యమం ప్రధానంగా కల రచనలు వచ్చినవి ఆ తరవాత వచ్చిన రచనలో జాతీయోద్యమ ప్రభావం, గాంధీయ సిద్ధాంతాల ప్రభావం కనిపిస్తుంది. 20వ శతాబ్దం మూడు - నాలుగు దశాబ్దాలలో సామ్యవాద ప్రభావితమయిన అభ్యుదయ రచనలు, ఫ్రాయిడ్, యుంగ్, ఇలియట్ మొదలయినవారి సిద్ధాంతాలచే ప్రభావితమయిన మనోవిశ్లేషణ, వాస్తవికతావాదం, అధివాస్తవికతా వాదంలాంటి కొత్త కొత్త ప్రవృత్తులు అన్ని సాహిత్యాలలో కనిపించ సాగినవి. ఈ విధంగా వివిధ భాషలలో అభివ్యక్తమయిన భారతీయసాహిత్యంలో ప్రాదేశికవైలక్షణ్యాలతోపాటు, సమానప్రవృత్తులూ కనిస్తవి. భాషాగత మయిన, వస్తుగతమయిన కొద్ది భేదాలు ఉన్నప్పటికి భారతీయ భాషలలో వచ్చిన సాహిత్యంలోని మూలధ్వని ఒకటే. మూలభావం ఒకటే. భావాత్మక మయిన ఈ సమైక్యాన్ని ఉద్ఘోషిస్తూ, శ్రీ అరవిందులు ఇలా అన్నారు

'The same culture reigns amid many variations of form in all this work of the regional peoples but each creates on the lines of its own peculiar character and temperament and gives a different stamp, the source of a rich variety in unity to each of these beautiful and vigorous literatures'[1]

---

1. As quoted by Shri M V. Rajgopal, I. A S, in his essay on 'Literature and National Integration' (P. 14) - National Integration Series IV.

(ప్రాంతీయ భాషలోని వివిధ సాహిత్య ప్రక్రియలలో ఒకే సంస్కృతి నేతృత్వాన్ని వహిస్తున్నది కాని ఒక్కొక్క భాష తన ప్రత్యేకలక్షణాలను, ప్రత్యేక ధోరణులను వ్యక్తంచేస్తూ, తన ప్రత్యేకతా ముద్రను ప్రదర్శిస్తుంది. సౌందర్య విలసితాలు, శక్తిమంతాలు అయిన ప్రాంతీయ సాహిత్యాలకు మూలాధారం వైవిధ్యంలో కనిపిస్తున్న ఏకీభావమే )

# II

భారతదేశంలోని భాషలను స్థూలంగా రెండు కుటుంబాలుగా విభజింపవచ్చును దక్షిణభారత దేశంలో వ్యవహారంలో ఉన్న తమిళ, కన్నడ, తెలుగు, మలయాళ భాషలు ద్రావిడభాషా కుటుంబానికి, ఉత్తర భారతదేశంలో వ్యవహారంలో ఉన్న, సంస్కృత, ప్రాకృత, అపభ్రంశ భాషా జన్యాలయిన అస్సామీ, బెంగాలి, గుజరాతీ, కాశ్మీరీ, హిందీ, మరాఠీ, పంజాబీ, ఉర్దూ మొదలయిన భాషలు ఆర్యభాషా కుటుంబానికి చెందినవి

ఉత్తర భారతదేశంలో ప్రస్తుతం వ్యవహారంలో ఉన్న ప్రముఖభాషలు సంస్కృతం, ప్రాకృతం, అపభ్రంశ భాషలనుండి వికసించినవే అపభ్రంశ భాషలనుండి ఆయాభాషలు దాదాపు 10-11 శతాబ్దులనుండి విడివడి, ప్రత్యేక భాషలుగా రూపొందినవి. అప్పటినుండే ఈ ఆధునిక భాషలలో సాహిత్యరచన ప్రారంభమయింది దక్షిణ భారతదేశంలో తమిళ కన్నడ భాషలలో అంతకు చాలాముందే సాహిత్య రచన జరిగినా, తెలుగు భాషలో మాత్రం సాహిత్యరచన 11వ శతాబ్దంలోనే మొదలయింది, 10-11 శతాబ్దులకు ముందు ప్రతిభాషా ప్రాంతంలోను జానపద వాఙ్మయం ప్రచురంగా ఉన్నట్లు తెలుస్తున్నది. రాగిరేకులు, శిలాశాసనాల మూలకంగా ఆనాటి భాషాస్వరూపం తెలుసుకోవడానికి వీలుకలుగుతున్నది.

దక్షిణ-ఉత్తర భారతదేశాలకు కూడలి స్థానంలో ఉన్న ఆంధ్రదేశంలో భాషా స్వరూపం స్థిరపడి, సాహిత్యరచనకు పునాదులు పడడానికి ద్రావిడ-ఆర్య భాషా-సాహిత్య సంప్రదాయాల కలయికయే కారణమని విద్వాంసుల అభిప్రాయం. 'ఆర్యజాతికి చెందిన ఆర్యులు ఈ దక్షిణ దేశమున కృష్ణా గోదావరీ మధ్య ప్రాంతమున నెలకొని అచ్చటి జనులతో కలిసిపోయి వారి భాషను చేపట్టిన పిదప అచ్చటివారి తెలుగు భాషనే వ్యవహరించి ఉందురు. ...... దీనినిబట్టి ఆంధ్రులు, తెలంగులు కలిసి ఆంధ్రులుకాగా, తెలంగ దేశమునకు, తెలంగు భాషకు ఆంధ్రము

అను నామము ఆంధ్రుల ప్రాబల్యముననే కలిగినదని స్పష్టమగుచున్నది.'[1] కాబట్టి ఇతర ద్రావిడ-ఆర్యభాషా-సాహిత్యాలకంటే ఎక్కువగా తెలుగులో ద్రావిడ-ఆర్య సాహిత్య సంప్రదాయాల సమ్మేళనం కనిపిస్తుంది.

ప్రోటోద్రవిడియన్ (మూలద్రవిడభాష) లేక ప్రాకృత - అపభ్రంశభాషల నుండి విడివడ్డ తరవాత ఆధునిక భారతీయ సాహిత్య వికాసక్రమంలో ప్రత్యేక మయిన సమాన లక్షణాలు కనిపిస్తవి

క్రీ శ. 10వ శతాబ్దంనాటికి బౌద్ధ జైన సంప్రదాయాలకు వైదిక ధర్మానికి కలిగిన సంఘర్షణల మూలంగా, మతాభినివేశంతో కూడుకొన్న రచనలు వచ్చాయి హిందీలో సాహిత్య రచన ప్రారంభానికి ముందు నవనాథులు, చౌరాసి (84) సిద్ధులు మొదలయినవారి అపభ్రంశ భాషానమ్మిశ్రిత మయిన రచనలు, బెంగాలీలో 'చర్యాపదాలు,' అస్సామీలో 'డాకేర్ బచన్' (డాక్ కవి రచనలు), ఒరియాభాషలో లభించిన 'బౌద్ధగాన్ ఔ దోహా' (బౌద్ధ గీతాలు, దోహాలు), కాశ్మీరీలో సితికంఠుని 'మహాన్యాయ ప్రకాశ్', మరాఠీలో ముకుందదాసుని 'వివేక సింధు', పంజాబీలో నాథసాహిత్యం, తెలుగులో శైవ సాహిత్యం మొదలయిన రచనలే కాకుండా, మహాభారత, రామాయణ అనువాదాలతో సాహిత్యం ప్రారంభ మయింది బెంగాలీలోకృత్తివాస రామాయణం, అస్సామీలో మాధవ కందళి రామాయణం, ఒడియాలో బలరామదాసు, సరళాదాసులు వేర్వేరుగా రచించిన రామాయణాలు, హిందీలో తులసీదాసు రచించిన రామచరిత మానసం, తెలుగులో రంగనాథ, భాస్కరరామాయణాలు, బెంగాలీ కాశీరామ్‌దాసు మహాభారతం, ఒరియాలో సరళాదాసు రచించిన మహాభారతం, తెలుగులో కవిత్రయ కృతమహా భారతం, ఒరియాలో జగన్నాథదాసు, హిందీలో సూరదాసు, తెలుగులో పోతనా మాత్యుడు మొదలయిన వారి భాగవతరచనలు, లాల్‌దే (కాశ్మీరీ), నరసీమెహతా (గుజరాతీ), చండీదాసు (బెంగాలీ) మొదలయిన వారి ఆధ్యాత్మిక సాహిత్యం. వంటి రచనలతో భారతీయ సాహిత్యంలోని ప్రారంభదశ సమృద్ధంగా కనిపిస్తుంది.

దేశంలో ఇస్లాం ధర్మ ప్రాభవంతో ఫారసీ సాహిత్య సంప్రదాయాలు, సూఫీ సిద్ధాంతాలతో కూడిన సాహిత్యం రచింపబడింది. ఈ మధ్యయుగంలో

1. శ్రీకోరాడ రామకృష్ణయ్యగారు తెలుగుభాష-పరిణామము. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము III - పేజి 26.

శౌరసేనీ అపభ్రంశ జన్యమైన ఉర్దూభాష దక్షిణభారతదేశంలో, బహమనీ సుల్తానుల రాజ్యకాలంలో సాహిత్యరచనకు ఉపయోగపడింది ఆ తరవాత, 2-3 శతాబ్దాల తరవాత, ఉర్దూభాష మళ్ళీ ఉత్తర భారతదేశం చేరింది

ఇస్లాంమత విజృంభణతో, ఆ మతానుయాయుల విలయతాండవంతో, దేశంలోని దేవాలయాలకు, ధర్మసంస్థలకు, సత్పురుషులకు రక్షణలేని పరిస్థితి ఏర్పడింది. భగవంతుడు తప్ప మరే శక్తి తమను ఉద్ధరించలేదనేభావం బాగా ప్రబలిపోయింది కర్మకాండ కాక శరణాగతి ఒక్కటే సంతరణోపాయంగా కనిపించింది. లౌకిక మర్యాదలపట్ల తూష్ణీంభావంతో కేవల నిర్గుణ, నిరాకారుడయిన భగవంతునిపట్ల భక్తి పెరిగిపోయింది ఇది ఇస్లాం, హిందూ ధర్మవిభేదాలకు అతీతమయిన భక్తి సాహిత్య సృష్టికి దారితీసింది ఆ భక్తి సాహిత్యం పరోక్షంగా సంఘంలో సమైక్య భావాన్ని పెంపొందించ గలిగింది

మహారాష్ట్రంలో నామదేవ్, జ్ఞానేశ్వర్, తుకారామ్, రామదాసు మొదలయిన వారు తమ రచనలతో ప్రజలను జాగృతులను చేస్తే, గుజరాతులో మీరాబాయి, నరసీ మెహతా లాంటివారు కృష్ణభక్తి ప్రచారం చేశారు హిందీలో నిర్గుణ భక్తికి చెందిన కబీరు, నానక్, సూఫీ సాధకుడయిన మలిక్ ముహమ్మద్ జాయసీ ఒక వైపున, శ్రీకృష్ణ భక్తుడయిన సూరదాసు, నందదాసులు, శ్రీరామభక్తుడయిన తులసీదాసు మరోవైపున, తమతమ ప్రత్యేక పద్ధతులలో భక్తిమార్గ ప్రచారం చేశారు కాశ్మీరులో షేక్‌నూరుద్దీన్ సూఫీ రహస్యవాద సిద్ధాంత ప్రచారం చేసిన వారిలో ప్రముఖుడు. బెంగాలీ, ఒరియాలలో రాధాకృష్ణ భక్తి సంప్రదాయపు వెల్లువ వచ్చింది. బెంగాలీలో చండీదాసు, ఒరియాలో దీనకృష్ణ, అస్సామీలో శంకరదేవ్ వైష్ణవభక్తి ప్రచారం చేశారు. చైతన్యుడు కీర్తన సాహిత్యంలో కొత్త పుంతలు తొక్కాడు. తమిళ, కన్నడ, మలయాళ, తెలుగు భాషలలో శైవ, వైష్ణవ భక్తి ప్రాచుర్యం దీప్తినందుకొన్నది. ఈ యుగంలో ప్రజాసామాన్యంలో భక్తి భావాలను జాగరితం చేసే ప్రయత్నాలకు సాహిత్యం ఊతగా నిలిచింది. ప్రజా సామాన్యానికి అర్థమయ్యేభాషలో కవులూ, భక్తులూ తమరచనలు సాగించారు. భక్తి కథలకు నెలవులయిన రామాయణ, భారత, భాగవతాలు సరళభాషలో వ్రాయబడ్డవి. మహాభక్తుల జీవిత చరిత్రలు కావ్యకథా వస్తువు లయినవి.

ఈ యుగంలో పశ్చిమ భారతదేశంలో – ముఖ్యంగా హిందీ భాషా

ప్రాంతంలో — హిందూ - ముస్లిం మత సంప్రదాయాల సమన్వయానికి ప్రయత్నా జరిగినవి ఆంధ్రదేశంలో వీరశైవ, వీరవైష్ణవుల మధ్య సమన్వయం ప్రదర్శ డానికి జరిగిన ప్రయత్నమే హరిహరనాథ తత్త్వనిరూపణం.

మధ్యయుగంలోని చివరిభాగంలో శృంగారభావ పూర్ణమయిన కావ్యరచన సాగింది. ఆ యుగంలోని కావ్యరచనకు విలాసతత్పరత, శృంగార ప్రియత్వం, రచనలో చమత్కారానికి ప్రాధాన్యం కొట్టవచ్చినట్లు కనిపిస్తవి రసోద్దీప్తి, కళాసౌందర్యాన్నే ప్రధానలక్ష్యాలుగా పెట్టుకొని, తమప్రభువుల ఆనందమే తమ రచనాచాతుర్యానికి పరమావధిగా పెట్టుకొని వారు రచనలు సాగించారు ఈ శృంగారరస ప్రాధాన్యానికి ముఖ్యకారణాలు ఆనాటి సాంఘిక రాజకీయ పరిస్థితులే విలాస జర్జరమైన జాతికి కామవాసనకంటే ఉపాస్యం వేరే విషయం ఉండదుకదా! కాని ఈ విశుద్ధ కామభావన నిసర్గకళాసృష్టికి ఆలంబనం కాగలిగింది, కళను కళగా నెలకొల్ప కలిగింది

ఈ విధంగా విలాస జర్జరమైన జాతి, స్వీయ పరాక్రమంపట్ల ప్రత్యయం లేని జాతి, పాశ్చాత్య ప్రభావానికి లొంగిపోయింది.

19వ శతాబ్దంలో పాశ్చాత్య సాహిత్యసంబంధం అంకురించి, క్రమంగా ముదిరి, 1857 నాటికి మహావృక్షమయి, భారతీయ సాహిత్యంలో నూతన వృక్షచ్ఛాయలను ప్రసరింప చేసింది. కలకత్తాలో ఫోర్టు విలియమ్ కాలేజీ స్థాపనతో తొలిసారిగా బెంగాలీ, హిందీ-ఉర్దూ భాషాసాహిత్యాలపై ఈ ప్రభావం ముఖ్యంగా కనిపిస్తుంది. భారతీయ పండితుల సహాయంతో విద్యాప్రియులయిన ఇంగ్లీషువారు వ్యాకరణాలు, పాఠ్యపుస్తకాలు, నిఘంటువులు వ్రాశారు, వ్రాయించారు క్రైస్తవ మిషనరీలు బైబిలును భారతీయ భాషలన్నింటిలోకి అనువదించి, ముద్రింపచేసి, గద్యరచన వికాసానికి దోహదం కల్పించారు. ఈ విధంగా, ఆధునిక యుగంలో ప్రతిభారతీయ భాషకు ఇంగ్లీషువారు చేసిన సేవ మరువరానిది. ముద్రణసౌకర్యాలు కల్పించి, పత్రికలు ప్రచురించి సాహిత్యాన్ని జనసామాన్యానికి సన్ని హితంచేసే కృషికి వారు నాంది పలికారు ఆ రోజుల్లో ప్రభవిల్లిన ప్రతిభామూర్తి, ఉర్దూమహాకవి గాలిబ్ వారు చీకట్లను పారద్రోలి, ఉషస్సందేశాన్ని అందిస్తున్నారని, ధ్వని ప్రధానంగా, నాటి పరిస్థితులను వర్ణించాడు.

పాశ్చాత్యపరిపాలన, విద్యావిధానాల ఫలితంగా సంఘంలో ఒక కొత్తవర్గం 'మధ్యతరగతి' ఉద్భవించింది దాంతో కొత్తకొత్త సమస్యలు రచనకు వస్తువులుగా వెలిశాయి

డాక్టరు సునీతి కుమార్ ఛటర్జీ అన్నట్లు 'Contact with the European spirit through English literature ushered in the Indian Renaissance and gave a new course to the literature in modern Indian languages '[1] (ఇంగ్లీషు సాహిత్యంద్వారా పాశ్చాత్యదావస్ఫూర్తితో సంబంధం, భారతదేశంలో పునరుజ్జీవనాన్ని ఉత్తేజపరిచింది అది ఆధునిక భారతీయ సాహిత్యాలలో, కొత్తమలుపుకి కారణమయింది) ఇంగ్లీషు సాహిత్యం, ఆధునిక విజ్ఞానం సహజంగా ఆలోచనాశీలురయిన భారతీయులను ప్రభావితులను చేయడంలో ఆశ్చర్యంలేదు

ఆంగ్లభాషా-సాహిత్యాల పరనంవల్లా, పాశ్చాత్య సంస్కృతి వ్యాప్తివల్లా, పాశ్చాత్య జీవితాదర్శాలతో సంబంధంవల్లా, దేశంలో రాకపోకల సౌకర్యాలు, ముద్రణా అవకాశాలు అభివృద్ధి చెందడంవల్లా, దేశంమొత్తంమీదట ఒకనూతన యుగం ప్రారంభమయింది. స్వభాష, జాతీయ సంస్కృతులపట్ల ఆనాటి యువతరం ఉద్దీప్తంకావడానికి ఆంగ్ల విద్యాభ్యాసమే ప్రధానకారణమని చెప్పడంలో ఎలాంటి సందేహం లేదు. ఆంగ్ల సాహిత్యాధ్యయనంవల్లనే భారతీయ సాహిత్యంలో ఆధునిక యుగానికి అంకురార్పణ జరిగింది వంగభాషలో రాజారామమోహన రాయ్, బంకించంద్రఛటర్జీ, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, ఒరియాలో రాధానాథ్, హిందీలో భారతేందు హరిశ్చంద్ర, గుజరాతీలో దల్పత్‌రామ్, నర్మదాశంకర్, మరాఠీలో విష్ణుకృష్ణ చిప్‌లూన్‌కర్, తెలుగులో కందుకూరి వీరేశలింగం పంతులు మొదలగు నవయుగ నిర్మాతలు సంఘ సంస్కరణోద్దేశ్యంతో నూతనవాఙ్మయ ప్రక్రియలకు పునాదులువేశారు పద్యరచన వెనకబడి, గద్యరచనకు, నాటకరచనకు అగ్రతాంబూలం లభించింది. కవిత్వంరగంలోకూడా భావకవిత్వానికి ప్రాబల్యం కలిగింది. ప్రణయం, ప్రకృతి, దేశభక్తి కావ్యానికి ప్రధానవస్తువులయినవి.

పాశ్చాత్య సంస్కృతి ప్రభావంచేత కలిగిన సాంస్కృతిక పరిణామంవల్ల

---

1. Literatures in Modern Indian Languages-Edited by V. K. Gokak. p. 44.

సంఘ సంస్కారోద్యమం ప్రబలమయింది బెంగాలులో బ్రహ్మసమాజం, దివ్య జ్ఞానసమాజం, గుజరాతు, పంజాబులలో ఆర్యసమాజం మొదలయిన మత, సంఘ సంస్కరణోద్యమాల ప్రభావం దేశం మొత్తంమీద కనిపించసాగింది జాతీయ ఆత్మ గౌరవం ప్రబోధం కలగచేసిన మహాత్ముడు వివేకానందుడు. వారి రచనలు, ఉపన్యాసాలు సమస్తదేశాన్ని ఉద్బోధించి, చైతన్యవంతం చేసినవి

జాతీయోద్యమానికి కర్ణధారులయిన వీరసావర్కార్, బాలగంగాధరతిలకు, లాలాలజపతిరాయ్, బాబురాజేంద్రప్రసాదు, అనీబిసెంటు, మొదలయినవారు తమ రచనలతో, ఉపన్యాసాలతో ప్రజలు స్వదేశ, స్వజాతిగౌరవాన్ని గుర్తించేట్టు చేశారు ఈ జాతీయోద్యమాన్ని సామాన్య ప్రజలలోకూడా వ్యాపింపచేసినవారు మహాత్మాగాంధీ. ఈ జాతీయోద్యమ ప్రభావం భారతీయ సాహిత్యాలన్నింటిలోను సమానంగా కనిపిస్తుంది. గాంధీగారి వ్యక్తిత్వ, సిద్ధాంతాల ప్రభావంతో భారతీయ భాషలన్నింటిలోను విపులమయిన సాహిత్యం వచ్చింది.

1930-36 ప్రాంతాలలో సామ్యవాద సిద్ధాంతాల ప్రభావం ప్రబలం కావడంతో, భారతీయ సాహిత్యంలో వర్గసంఘర్షణ, వెట్టుబడిదారీవర్గం దోపిడి, కూలి, రైతు జనాల కష్టసుఖాలు మున్నగువిషయులను చిత్రించే అభ్యుదయవాదధోరణులు ప్రారంభమైనవి

ఫ్రాయడ్, యంగ్ మొదలయిన మనస్తత్వశాస్త్రజ్ఞుల సిద్ధాంతాల ప్రభావం వల్ల వ్యక్తిమనస్తత్వ చిత్రణకు మనోవిశ్లేషణాత్మకమయిన సమస్యలకు నవలల్లో, కథల్లో ప్రాధాన్యం లభించింది.

నూతన సాహిత్య ప్రక్రియలకు ముక్తచ్ఛందం లేక స్వేచ్ఛాఛందం ప్రయుక్తం కాసాగింది

స్వాతంత్ర్యోపలబ్ధికిపూర్వం భారతీయసాహిత్యాలలో పురావైభవాన్ని సముజ్జ్వలంగా చిత్రించే రచనలు, దేశభక్తిని ప్రబోధించే రచనలు, మాత్రారాధనం, సంఘసంస్కరణం, అమలిన శృంగారం మొదలయిన విషయాలతోకూడిన రచనలు ప్రస్ఫుటంగా, ప్రధానంగా కనిపించేవి. స్వాతంత్ర్యానంతరం కల్పనల్లో, ప్రక్రియల్లో ఇతరదేశ వాఙ్మయప్రభావం, అనుకరణ అధికంగా కనిపిస్తున్నది.

పరప్రభుత్వం అంతరించి, స్వరాజ్యంవచ్చినా, దేశప్రజల కష్ట-నష్టాలు ఎక్కువై, సుఖశాంతులు గగన కుసుమాలుకావడంతో, ప్రస్తుతవ్యవస్థలోని కుళ్ళును

కడిగివేయాలని రచయితలు ప్రయత్నిస్తున్నారు. బెంగాలులోని భూఖీపీఢీ, హిందీలోని నయీకవిత, అకవితలు, తెలుగులోని దిగంబరకవిత, విప్లవ కవితలు ఇలాంటి భావాల ప్రభావంవల్ల వచ్చినవే

నిష్పాక్షికంగా అధ్యయనంచేస్తే ఉత్తరభారతంలో, దక్షిణభారతంలో ప్రచురంగా ఉన్న భాషల్లో వెలువడిన, వెలువడుతున్న, సాహిత్యాలలో అంతరాత్మ ఒకటిగానే గోచరిస్తుందనే యాథార్థం ప్రత్యక్షమవుతుంది వైజ్ఞానికాన్వేషణల ఫలితంగా విశ్వాత్మవిపక్రృతికి ఈ సాహిత్యాలు ప్రతీక్షిస్తున్నట్లుగా ద్యోతకమవుతున్నది. భాష బాహిరరూపం కనుక సీమితం, దాని అంతస్సు సాహిత్యం. అది అనంతం.

# III

భారత సాంస్కృతిక రంగంలో 'మధ్యదేశ' (గంగాయమునలమధ్య ప్రాంతం) భాషఅయిన సంస్కృతం సర్వభాషా సాహిత్యాలకు మూలకందంగా విలసిల్లిందని తెలుసుకున్నాము. భాషా శాస్త్రపరంగా సంస్కృత-ప్రాకృతాలనుండి జనించిన హిందీభాషకు, మధ్యయుగంలో, దేశవ్యాప్తంగా ప్రచారం కలిగింది. రాజకీయ, సాంఘిక, మత సంబంధమైన కారణాలవల్ల హిందీ-హిందుస్థానీ భాషలు మాట్లాడేవారు దేశం నలుమూలలా వ్యాపించారు. అపభ్రంశభాషాసమ్మిశ్రితమయిన హిందీలో రచనలు సాగించి, సంఘసంస్కరణకు నడుంకట్టిన గోరఖనాధాది నవనాధుల చరిత్ర ఆధారంగా గౌరన 'నవనాథచరిత్ర' (14వ శతాబ్దం) రూపు దాల్చింది. అనగా 14వ శతాబ్దంనాటికే నవనాథుల చరిత్రకు దేశవ్యాప్తమైన ప్రచారం లభించిందన్న విషయం రూఢమవుతున్నది.

17వ శతాబ్దం చివరిభాగంలో తంజావూరును పరిపాలించిన మహారాష్ట్ర నరేశుడు, అభినవభోజుడయిన షాహజీమహారాజు (1684-1712) తెలుగులోనే కాక, హిందీలోకూడా యక్షగానాలు రచించాడు 'రాధా వంశీధర విలాస నాటకం'లో రాధాకృష్ణుల సంయోగ వియోగాలు, 'విశ్వాతీత విలాసనాటకం'లో త్రిమూర్తులలో శివమాహాత్మ్యం చిత్రించబడ్డవి. ఈ నాటకాల భాష హిందీ అయినా, పాటలు కర్ణాటక సంగీతబాణీలో వ్రాయబడ్డవి. కర్ణాటక సంగీతబాణీలో ప్రప్రథమంగా హిందీ భాషను మలచిన గౌరవం షాహజీమహరాజుదే. ఈ మధ్యనే షాహజీమహరాజు రచించిన మరోనాటకం వెలుగులోనికి వచ్చింది. ఆయక్షగానంపేరు 'పంచభాషా

విలాసనాటకం ' ఈ రచనలో సంస్కృతం సూత్రధారభాష (Link Language) కాగా ఇతరపాత్రలు హిందీ, తెలుగు, తమిళ, కన్నడ, మరాఠీ భాషలు వ్యవహరిస్తారు ఈ నాటకంలో ధర్మజ రాజసూయ సందర్భంలోవచ్చిన అనేకదేశాల రాకుమార్తెలు, తమతమ భాషలలో శ్రీకృష్ణునికి ప్రణయ నివేదనం చేయడం అనే శృంగారరస భూయిష్ఠమైన సన్నివేశాన్ని చిత్రించాడు షాహజీ ఈ రచనలు యక్షగాన ప్రక్రియకు సంబంధించినవి.

1880-81ల మధ్య, ఆ తరవాత 1885లో 'ధార్వాడ నాటక కంపెనీ' అనే పేరిట ఆంధ్రప్రాంతంలో పర్యటించి, వెళ్ళినచోటల్లా హిందీలో నాటకాలు ప్రదర్శించిన, 'ఆల్టేకర్ నాటకసమాజం' తెలుగు నాటకరంగానికి, నాటక సాహిత్యానికి ఎనలేని సేవచేశింది ధార్వాడ కంపెనీల ప్రదర్శనలుచూచి, ఆ విధంగా నాటకాలు రచించి, ప్రదర్శించాలన్న సంకల్పం చాలామంది ఆంధ్రులకి కలిగింది శ్రీ కె వి. గోపాలస్వామిగారన్నట్లు 'ఆ సంకల్పమే ఆంధ్రనాటక ప్రదర్శనానికి నాందీవాక్యం ' ధార్వాడనాటక కంపెనీ ప్రదర్శనల ఫలితంగా, ఆంధ్రదేశంలోని అనేక నగరాలలో నాటక సమాజాలు వెలిశాయి. వీరు చాలామటుకు తెలుగులోనే నాటకాలు వ్రాయించి, అభినయించేవారు. కాని 1884లో మచిలీపట్టణంలో 'నేషనల్ థియేటర్'ను స్థాపించిన మొగిలిగిద్దల రామానుజరావుకు, దాసాని వెంకటస్వామి నాయుడుకు ధార్వాడ నాటక కంపెనీవారివలె హిందీలో నాటకాలు ఆడించాలనే అభిప్రాయం కలిగింది. అందుచేత వారు రేపల్లెలో స్కూలుటీచరుగా పనిచేస్తున్న నాదెళ్ళ పురుషోత్తమ కవిని హిందీలో నాటకాలు వ్రాసిపెట్టమని అడిగారు. పురుషోత్తమకవిగారు రెండు సంవత్సరాలలో (1884-86) 32 హిందీ నాటకాలువ్రాసి ఇవ్వడమేకాకుండా, స్వయంగా దర్శకత్వం నెరపారు. రెండవసారి ఆంధ్రదేశంవచ్చిన ధార్వాడనాటక కంపెనీవారు ఆ నాటకాలుచూచి, చాలా ప్రశంసించారట. తమ 32 నాటకాలలో మచ్చుకి ఒక్కనాటకాన్ని 'రామదాసచరిత్ర'ను స్వయంగా పురుషోత్తమ కవిగారు 1916లో తెలుగులిపిలోనే ముద్రించారు. అయితే ఆ రోజుల్లో పురుషోత్తమకవిగారే కాక, మరికొందరు ఆంధ్రులు హిందీలో నాటకాలు వ్రాసి, ప్రదర్శించారని శ్రీపంచాగ్నుల యజ్ఞనారాయణశాస్త్రిగారు, శ్రీ పురాణం సూరిశాస్త్రిగారు మొదలయిన వారు వ్రాశారు. శ్రీ యజ్ఞనారాయణశాస్త్రిగారు 'ఆంధ్రనట ప్రకాశిక'లో, ఐదవ అధ్యాయంలో ఈ విషయాన్ని విశదంగా వ్రాసారు. శాస్త్రిగారు 'విశాఖపట్టణంలోని జగన్మిత్ర సమాజంవారు 1889-90 లలో హిందీలో నాటకాలు ప్రదర్శించారనీ,

ప్రియసల్లాపనాటక కంపెనీవారు గోవిందరావు, శంకరం అనే ప్రముఖనటుల సహా యంతో హిందీ నాటకాలు ఆడారనీ, కాకినాడలో వెదురుమూడి శేషగిరిరావు 'శివాజి చరిత్ర', 'పీష్వా నారాయణరావు వధ' అనే హిందీనాటకాలువ్రాసి, ప్రదర్శించారనీ, ఏలూరులో వామనభట్టజోషీ 1885 నుండి 1890లో హిందీనాటకాలు ప్రదర్శింప చేస్తూ ఉండేవారనీ, 1902లో నరసాపురంలో బుద్ధిరాజు బ్రహ్మానందం, బొమ్మ కంటి కృష్ణమూర్తి, మామిళ్ళపల్లి కేశవాచార్య అనేవారు 'ఆర్యానంద హిందూ నాటక సమాజం' స్థాపించి హిందీలో నాటకాలు అభినయింపచేసేవారనీ, కేవలం హిందీ నాటకాల ప్రదర్శనకై భీమునిపట్టణంలో మింది రామచంద్రరావుగారు 'భక్తి విలాసినీ సమాజాన్ని 'స్థాపించారనీ' వ్రాశారు తాత్పర్యం ఏమిటంటే ఆంధ్రనాటక సాహిత్య ప్రారంభదశలో పలువురు తెలుగువారు హిందీ-హిందూస్తానీ భాషలలో చాలా నాటకాలు వ్రాశారు కాని కేవలం నాటక సమాజాలకోసరం వ్రాయబడడంతో, ఆ నాటక సమాజంవారి మోజుతీరగానే, ఆ నాటకాలుకూడా కాలగర్భంలో కలిసి పోయాయి కాని కీ. శే నాదెళ్ళమేధాదక్షిణామూర్తిగారి కృషివలన పురుషోత్తమ కవిగారి హిందీరచనలలో-32 నాటకాలలో-14 నాటకాలు మాత్రం, నశించిపోకుండా నిలిచి, ఆంధ్రులు హిందీనాటకానికి చేసినసేవను గుర్తుకు తెస్తూఉన్నవి

ఈ సందర్భంలోనే శ్రీ శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారు, పుండా కామయ్యలేక నరహరిశాస్త్రిగారి రామచరిత మానసానువాదం పేర్కొనదగినది దోహా, చౌపాయి మొదలయిన హిందీ ఛందస్సులలో, ద్వితీయాక్షరప్రాస, అంత్యానుప్రాస, తెలుగు యతి నియమాలను పాటిస్తూ, ఆంధ్రీకరించబడిన ఈ రచనలో ధారాశుద్ధి లేక పోయినా, అనువాదకుల కృషి ప్రశంసనీయము. శ్రీముక్కామల రుక్మేశ్వరశాస్త్రి వ్రాసిన వ్రాతప్రతి మాత్రం ప్రస్తుతం లభిస్తున్నది.

దక్షిణాఫ్రికానుండి వచ్చి, భారత రాజకీయ రంగంలో ప్రవేశించడానికి ముందుగా, గాంధీగారు ఒక సంవత్సరంపాటు భారతదేశ పర్యటన చేశారు. ఆ పర్యటనలో భారతదేశానికంతా జాతీయభాష కాగలిగిన అర్హత హిందీకే ఉన్నదని వారు గ్రహించారు. అందుచేత వారు తమ నిర్మాణ కార్యక్రమంలో హిందీకి ప్రముఖస్థానం కల్పించారు. దాంతో జాతీయోద్యమంతోపాటు హిందీ భాషా ప్రసార - ప్రచార కార్యక్రమాలకు అత్యధికంగా ప్రోత్సాహం లభించింది ఆంధ్రదేశంలో కూడా హిందీభాషా ప్రచారం ముమ్మరంగా సాగింది. హిందీభాష నేర్చుకోవడమూ, నేర్పించడమూ జాతీయ భావానికి ప్రధాన లక్షణాలుగా ఎంచ్చ

[2]*

బద్ధవి ఖద్దరు ధరించడానికి, వందేమాతరం పాడడానికి కలిగిన ప్రాముఖ్యమే హిందీ ప్రచారానికి కూడా కలిగింది రాజకీయ రంగంలో ముందుగా వచ్చిన ఈ ప్రభావం సాంస్కృతిక-సాహిత్య రంగాలలో కూడా కనిపించింది కీ శే. బసవ రాజు అప్పారావుగారి లాంటివారు కూడా ఆంధ్రసాహిత్యం సమృద్ధం కావడానికి అన్యభాషా సంస్కారమూ, అన్యసాహిత్య పరిచయమూ అవసరమని ఉద్ఘా టించారు. ఆంధ్రులు ఇతర భాషలు-ప్రధానంగా ఆంగ్లం, బెంగాలీ, హిందీ భాషలు-నేర్చుకొని, తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నంచేసి, ఇతర భాషలలో రచనలు సాగించి, తమ ప్రతిభావ్యుత్పత్తులు వెల్లడించారు

ఉత్తరభారత సాహిత్యాలలో ముఖ్యంగా బెంగాలీ, హిందీ భాషల ప్రభావం తెలుగు సాహిత్యంమీద కనిపిస్తుంది. బెంగాలీ భాషలో వచ్చిన సాహిత్య ప్రక్రియలు, ఆ సాహిత్యంలోని ప్రతిభామూర్తుల రచనలు-వీటి ప్రభావం ప్రత్యక్షం గాను, పరోక్షంగాను తెలుగు సాహిత్యంలో కనిపిస్తుంది కాని ఆయా భాషలను నేర్చుకొని అందులోస్వయంగారచనలు సాగించినవారు చాలాతక్కువ.* అందుచేత ముందుగా హిందీభాషా సాహిత్యాల ప్రభావాన్ని గురించి ముచ్చటించుకుందాము.

మరోభాషలోని ఉత్కృష్టమైన రచనచే ప్రభావితుడయి, సహృదయుడయిన రచయిత, ఆ రచనను తన భాషలో అనువదించి, తన వారికి ఆ ఆనందాన్ని అందిద్దామని ప్రయత్నం చేస్తాడు. తన భాషలోని శ్రేష్ఠమయిన రచనలను ఇతర భాషలలోకి అనువదించి, ఆ రచనల సాహిత్య గౌరవంతో ఇతరులకు పరిచయం కల్పించాలని కూడా ప్రయత్నం చేస్తాడు. ఈ భావనయే అనువాద ప్రక్రియకు మూలం. అనువాదం ఇతర భాషా సాహిత్యాలవల్ల కలిగే పరోక్ష ప్రభావం అని చెప్పాలి. అనువాదాల ద్వారా హిందీ సాహిత్యంలోని ఉత్తమ రచనలు ఎన్నో తెలుగులోకి వచ్చాయి. ఆ అనువాదాలవల్ల తెలుగు సాహిత్యంలో క్రొత్తపోకడలు వచ్చాయి. ఈ పరోక్ష ప్రభావం ముఖ్యంగా నవలా సాహిత్యంలో కనపడుతుంది. ఉన్నవవారి మాలపల్లి మొదలైనవాటితో తెలుగు నవలలో వచ్చిన గ్రామీణ సమస్యల చిత్రణకూ రాజకీయ చైతన్య చిత్రణకూ ప్రేమచందు నవలల తెలుగు అనువాదాల ప్రభావం మరికొంత తోడ్పడింది అని చెప్పవచ్చును.

---

* తెలుగు విజ్ఞానసర్వస్వాన్ని అందించడానికి ప్రప్రథమంగా ఉద్యమించిన కీ. శే. కొమర్రాజు వెంకట లక్ష్మణరావు పంతులుగారు మరాఠీ భాషలో విద్వత్తును సంపాదించి, మరాఠీ రచయితగా పేరొందినారు. అయితే ఆంధ్రులు హిందీ భాషను నేర్చుకొని, అందులో సాహిత్యాన్ని సృష్టించిన ఘనతను సంపాదించుకున్నారు.

శ్రీ అట్లూరి పిచ్చేశ్వరరావు, లల్లన్, ఆలూరి భుజంగరావు, చాపలి రామ చంద్రరావు, యన్. యస్. వి సోమయాజులు మొదలయినవారు ప్రేమచందు రచనలను ఆంధ్రీకరించిన వారిలో ప్రముఖులు.

సుప్రసిద్ధ హిందీ నవలా రచయితలయిన జయశంకర్ ప్రసాద్, జైనేంద్ర కుమార్. కిషన్ చందర్ రచనలను శ్రీ ఛాయేశ్వర్ అనువదించారు. మనోవిశ్లేషణ ప్రధానంగా నవలలు రచించిన శ్రీ ఇలాచంద్రజోషీ నవలలు కూడా తెలుగులోకి వచ్చాయి. కేంద్ర సాహిత్య అకాడమీవారు హిందీలోని కొన్ని ప్రసిద్ధనవలలను తెలుగులోకి అనువదింప చేశారు. వాటిలో చెప్పుకోతగ్గది ఆచార్య హజారీప్రసాద్ ద్వివేదీగారి 'బాణభట్ట్‌కీ ఆత్మకథ'కు కీ. శే. ఏ సి కామాక్షిరావుగారి అనువాదం.

హిందీలోని ఛాయావాదం, రహస్యవాదం, ప్రగతివాదం తెలుగులోని భావ కవిత్వం, మర్మకవిత్వం, అభ్యుదయ కవిత్వ పోకడలలో ఎన్నో సామాన్య లక్షణాలు కనిపిస్తవి. కాని వాటిని పరస్పర ప్రభావం అని చెప్పడానికి వీలులేదు. ఎందుకంటే రెండింటికి మూలం ఇంగ్లీషులోని రొమాంటిసిజమే, వంగభాషలోని రవీంద్ర కవిత్వమే. మచ్చుకి సమాన భావాలుకల కొన్ని కవితలను ఉట్టంకిస్తాను.

శ్రీ రామ్‌ధారీసింహ 'దినకర్' శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగార్లు రచించిన ఈ క్రింది కవితలలో భావసామ్యం గమనించ తగింది.

'సింధు క్యాసునూఁ. గర్జన్ తుమ్హారా
స్వయం యుగధర్మ్ కీ హుంకార్ హూఁ. మైఁ ।
కఠిన్ నిర్ఘోష్ హూఁ. భీషణ్ అశనికా
ప్రలయ్‌గాండీవ్ కీ టంకార్ హూఁ. మైఁ ।'

('హుంకార్' లో 'పరిచయ్' అనే కవిత)

'ఏను స్వేచ్ఛా కుమారుడ నేను గగన
పథ విహార విహంగమ పతిని నేను
మోహన వినీల జలధరమూర్తి నేను
ప్రళయ ఝంఝూ ప్రభంజన స్వామి నేను'.

( కృష్ణపక్షము )

శ్రీ సుమిత్రానందన్ పంత్, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి ఈ క్రింది కవితలలోని భావసామ్యం పరిశీలించ తగింది.

'ఛోడ్ ద్రుమోంకీ మృదుఛాయా
తోడ్ ప్రకృతి సేభీ మాయా
బాలే ! తేరే బాల్-జాల్‌మేఁ
కైసే ఉల్‌ఝాదూఁ లోచన్,
భూల్ అభసే ఇన్‌జగ్‌కో ।'

'ఆకులో నాకునై, పూవులో బూవునై
కొమ్మలో గొమ్మనై, నునులేత రెమ్మనై
ఈ యడవి దాగిపోనా ?
ఇట్లైన
నిచటనే యాగిపోనా ?

(కృష్ణపక్షము)

ఆత్మ-పరమాత్మల సంబంధాన్ని అనేక విధాలుగా వర్ణించే శ్రీ సూర్యకాంత్ త్రిపాఠీ 'నిరాలా', శ్రీ నాయని సుబ్బారావుగారి క్రింది కవితలలో భావసామ్యం గమనార్హం.

'తుమ్ తుంగ హిమాలయ శృంగ్
ఔర్‌మైఁ. చంచల్‌గతి సుర-సరితా,
తుమ్ విమల హృదయ ఉచ్ఛ్వాస్
ఔర్ మైఁ కాంత కామినీ కవితా,
తుమ్ ప్రేమ్ ఔర్ మైఁ శాంతి
తుమ్ సురాపాన ఘన్ అంధకార్
మైఁ హూఁ మత్‌వాలీ భ్రాంతి ।
తుమ్ యశ్‌హో, మైఁహూఁ ప్రాప్తి,
తుమ్ కుంద్-ఇందు అరవింద్ శుభ్ర
తో మైఁ హూఁ నిర్మల్ వ్యాప్తి' ।

**('అపరా'లో 'తుమ్ ఔర్ మైఁ' అనే కవిత)**

త్రిభువనమ్ములలో రసోద్దీపనమ్ము
వెల్లివిరియించు ప్రణయరూపిణివి నీవు
నీ దరస్మితరోచిః ప్రసాదకాంక్ష
కొనలుసాగిన ముగ్ధ భిక్షుకుడ నేను.
అమృతమునకు మాధుర్యమ్ము లలవరించు
కలశవారాశివీవు నీ యలల లేత
పులకరింపుల నునుజలువలకు మురియు
నెడరువేచిన బాలచంద్రుడ నేను
నీవు జీవన దాత్రివి నేను జీవి
నీవు లేకున్న నాలేమియే ధ్రువమ్ము.

('సౌభద్రుని ప్రణయ యాత్ర'లో నీవు-నేను అనే కవిత)

దేశమాతకై సర్వస్వం త్యాగంచేసే పుణ్యపురుషుల పవిత్ర పాదధూళి స్పర్శకై తపించే పుష్పకామనను చిత్రీకరిస్తూ శ్రీ మాఖన్‌లాల్ చతుర్వేది రచించిన కవితకు శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రిగారి కవితలో భావసామ్యం పరిశీలించ తగింది.

'చాహ్ నహీఁ, మైఁ సురబాలాకే
గాహనోఁమేఁ గూంథా జాఊఁ।
చాహ్‌నహీఁ ప్రేమీ మలామేఁ
బింధ్ ప్యారీకో లల్‌చాఊఁ।
చాహ్ నహీఁ, స్రమాటోంకీ శవ్‌పర్
హేహరి, డాలాజాఊఁ।
చాహ్ నహీఁ, దేవోంకీ సిర్‌పర్
చఢూఁ భాగ్యపర్ ఇర్‌లాఊఁ।
ముఝే తోడ్‌లేనా వనమాలీ।
ఉస్ పథ్‌మేఁ దేనా తుమ్ ఫేంక్,
మాతృభూమి పర్ శశ్ చఢానే
జిస్ పథ్ జావేఁ వీర్ అనేక్'॥

'నాకు తలంపు లేదు లలనాజనతా కబరీభరైక
భూషా కలనన్, సతీమృదు భుజాంతర తల్ప
కుచోపగూహ బిబ్బోకమునన్, వధూజన
కపోల గళ శ్రవణావతంస హేవాకమునన్
నీచపు దాస్యవృత్తి మన నేరని భారత
మాతృదేశ సేవాచరణమ్మునం
దసువు లర్పణ సేసినవారి పార్థివశ్రీ
చెలువారుచోట, తదసృగ్గుచులన్ వికసించి
వాసనల్ వీచుచు రాలిపోవగ వలెం
తదుదాత్త సమాధి మృత్తికన్'.

('వైతాళికులు' లో 'కాంక్ష' అనే కవిత)

శ్రీమతి సుభద్రాకుమారి చౌహన్ 'రుకరా దోయా ప్యార్‌కరో' శ్రీదువ్వూరి రామిరెడ్డిగారి 'నైవేద్యం' లోను, శ్రీ సుమిత్రానందన్ పంత్ 'మౌన్ నిమంత్రణ్' శ్రీ కృష్ణశాస్త్రిగారి 'ఎవరహో' లోను, శ్రీ సోహన్‌లాల్ ద్వివేదిగారి 'యుగపురుష్' శ్రీ బసవరాజు అప్పారావుగారి 'గాంధీప్రభ' లోను ఎంతో భావసామ్యం గుబాళిస్తుంది. అయితే ఒకే యుగంలో, ఒకేరకమైన కావ్యప్రవృత్తులు ఉబుకుతున్న సమయంలో ఇలాంటి భావసామ్యం కనబడడంలో ఎటువంటి ఆశ్చర్యం లేదు. కాని ఈ భావసామ్యాన్ని పరస్పర ప్రభావం అని చెప్పడానికి వీలులేదు.

కాని హిందీ భాషా సాహిత్యాల అధ్యయన-అధ్యాపనల మూలకంగా హిందీ-తెలుగు, తెలుగు-హిందీ అనువాదాలుచేసే వారేకాకుండా, స్వయంగా హిందీభాషలో రచనలు సాగించి, ప్రఖ్యాతివహించిన ఆంధ్రులు పలువురున్నారు. నవల, కథ, కవిత్వం, ఏకాంకికలు మొదలయిన అన్నిరంగాలలో ఆంధ్రులు తమ ప్రతిభాముద్ర వేశారు. సంకుచిత మనస్తత్వానికి అతీతులైన ఆంధ్రులు సంస్కృతం తరవాత హిందీభాషా-సాహిత్యాలకు అద్వితీయమైన సేవచేశారు.

హిందీలో నవలలు, నాటికలు వ్రాసి పేరెన్నికగన్నవారిలో శ్రీ ఆరిగెపూడి రమేశచౌధరి ప్రథమగణ్యులు. వారు ఇప్పటికి దాదాపు 20 నవలలు, అనేక నాటికలు, కథలు వ్రాసారు. 'దూర్ కే ఢోల్', 'పతితపావనీ', 'ధన్య భిక్షు', 'ఉధార్ కే

పంఖ్' మొదలయిన నవలలు, 'భగవాన్ ఖలాకరే', 'బంద్ ఆంఖేం' మొదలయిన కథాసంకలనాలు, 'నేపథ్య', 'బిజ్లీ ఔర్ బారిష్' మొదలయిన ఏకాంకికా సంకలనాలు పాఠకలోకాన్ని ఎంతో అలరించాయి రమేశచౌధరీగారి రచనలు ఇతర భాషలలోకి అనువదించబడ్డాయి.

శ్రీ బాలశౌరిరెడ్డిగారు హిందీలో నవలలు రచించడమేకాక, పరిచయాత్మక, తులనాత్మక విమర్శప్రధానమైన వ్యాసాలు చాలా వ్రాశారు అనువాదాలుకూడా చాలా చేశారు. 'బారిస్టరు', 'లకుమ', 'భగ్నసీమాయే', జిందగీకీ రాహ్', 'శబరీ' మొదలయిన నవలలు, 'సత్యకీ ఖోజ్' అనే ఏకాంకికా సంకలనం ప్రచురించబడ్డవి 'పంచామృత్' 'ఆంధ్రభారతీ' అనే పుస్తకాలలో రెడ్డిగారు తెలుగుసాహిత్యంలోని ఉత్కృష్ట రచనలను హిందీవారికి పరిచయంచేశారు.

శ్రీ బి. వి సుబ్బారావుగారు 'హరికిశోర్' అనే పేరుతో కవితలు, కథలు వ్రాశారు. 'ఉఫాన్' అన్నది వారి ప్రసిద్ధనవల ఈ మధ్యనే వారి కావ్యసంకలనం 'మేరి కావ్యసాధన' అనే పేరుతో ప్రచురించబడ్డది

హిందీకావ్యజగత్తులో శ్రీవారణాసి రామమూర్తి 'రేణు'గారు సుప్రసిద్ధులు 'విహగ్ కే గీత్' వారి కావ్యసంకలనం. 'తెలుగు కే కబీర్ వేమన్న' అనే గ్రంథంలో వేమన్నను సమగ్రంగా వారు హిందీవారికి పరిచయంచేశారు. 'ఆదాన్ ప్రదాన్' అనే వ్యాస సంకలనంలో తులనాత్మక పరిశీలనా ప్రధానాలయిన వ్యాసాలు కూర్చబడ్డవి. ఈ రంగంలో 'రేణు'గారు ప్రథములు, ప్రముఖులు. ఆకాశవాణిద్వారా 'రేణు'గారి రూపకాలు ఎన్నో ప్రసారమయినవి.

ప్రొఫెసరు జి. సుందరరెడ్డిగారి ఆలోచనాత్మకాలయిన వ్యాసాలు 'సాహిత్య ఔర్ సమాజ్', 'మేరే విచార్' అనే పుస్తకాలుగా ప్రచురించబడ్డవి. హిందీ ఔర్ తెలుగు-ఏక్ తులనాత్మక్ అధ్యయన్' అనే పుస్తకంలో వారు హిందీ తెలుగు సాహిత్య ప్రవృత్తులను తులనాత్మకంగా పరిశీలించారు. దక్షిణ్ కీ భాషాయేం తథా సాహిత్య'లో దక్షిణ భారతదేశభాషా సాహిత్యాల సమగ్రపరిచయంచేశారు. ఆంధ్ర విశ్వవిద్యాలయ హిందీశాఖాధ్యక్షులైన శ్రీరెడ్డిగారు హిందీభాషా సాహిత్యాలకు విశిష్టమైన సేవచేస్తున్నారు.

డా. చావలి సూర్యనారాయణమూర్తిగారు కవిగాను, నాటకకర్తగాను ప్రసిద్ధి

చెందారు 'సతీ ఊర్మిళ', 'మానస్‌లహరీ' అనే కావ్యాలు కాకుండా మూర్తిగారు రచించిన కవితలు పత్రికలలో ప్రచురించబడుతూ ఉంటవి 'సమఝౌతా' అనే సాంఘిక నాటకం, 'మహానాశ్ కీం జోర్', 'సత్యమేవ జయతే'అనే పౌరాణిక నాటకాలేకాక అనేకంగా రేడియోనాటకాలుకూడా వ్రాశారు హిందీ-తెలుగు సాహిత్యాలలో గల రామకథా సాహిత్యాన్ని తులనాత్మకంగా పరిశీలిస్తూ మూర్తిగారు రచించిన పరిశోధనా గ్రంథం వారి విమర్శాపాటవానికి మచ్చు తునక

ఆంధ్రదేశంలో హిందీ ప్రచారానికి ఎంతోకృషిచేసిన శ్రీ యస్ ఐ శివరామ శర్మగారు హిందీ-తెలుగు వ్యాకరణాలను తులనాత్మకంగా పరిశీలిస్తూ, ఉత్తమ గ్రంథాన్ని వెలువరించారు

దక్షిణభారతచరిత్ర ఆధారంగా శ్రీ చోడవరపు రామశేషయ్యగారు 'బొబ్బిలి', 'గృహిణి', 'మంత్రి రామయ్య', 'రాణీ మల్లమ్మ', 'రాణీ కణ్ణకీ'అనే నాటకాలు రచించారు

శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తిగారు తెలుగు బుర్రకథ పద్ధతిలో 'నాగార్జున సాగర్' అనే బుర్రకథ హిందీలోవ్రాసి పండితులమెప్పు పొందారు అనువాదాలే కాకుండా, వారు తెలుగు సాహిత్యాన్ని పరిచయంచేస్తూ అసంఖ్యాకంగా వ్యాసాలు కూడా వ్రాశారు

శ్రీ ఆలూరి బైరాగిచౌధరిగారు హిందీలో చక్కటి కవిత్వం వ్రాశారు. 'పలాయన్', 'బదలీకీ రాత్' అనే కవితా సంకలనాలను ఆయన ప్రచురించారు.

డా ముట్నూరి సంగమేశంగారు 'విశ్వామిత్ర' అనే పుస్తకాన్ని ప్రచురించారు.

ప్రొఫెసరు యస్ టి. నరసింహాచారిగారి పరిశోధన గ్రంథమైన 'సాహిత్యిక్ అభిరుచి తథా సమీక్ష' అనే గ్రంథం పండితుల మెప్పు పడసింది. ఇదికాక 'ప్రసాద్ కీ కహానీయాఀ : ప్రకృతిమూలక్ విశ్లేషణ్', 'సౌందర్య తత్త్వనిరూపణ్' అనే గ్రంథాలుకూడా చెప్పుకోతగ్గవి.

డా. ఇలపావులూరి పాండురంగారావుగారు సుప్రసిద్ధులయిన కవులు. రచయితలు హిందీలో డాక్టరేటుపట్టం పొందిన ప్రథమాంధ్రులు డా. పాండురంగారావుగారు. తెలుగు-హిందీ రూపకాలను తులనాత్మకంగా విమర్శిస్తూ వారు పరి

శోధన గ్రంథం వ్రాశారు సుప్రసిద్ధ హిందీ మహాకావ్యమయిన 'కామాయనీ'కి వారి చక్కని తెలుగు అనువాదం ఈ మధ్యనే ప్రచురింపబడింది. శ్రీ కంచి కామకోటి పీఠాధీశ్వరుల ఆదేశం ప్రకారం 'కామాక్షీ విలాసం' అనే హిందీ కావ్యం రచించి 'కవిరత్న' అనే సార్థక బిరుదనామం పొందారు రావుగారు

శ్రీ పురుషోత్తమకవిగారి హిందీరచనలను, హిందీవారికి పరిచయంచేసిన సదవకాశం ఈ గ్రంథప్రణేతలలో ఒకరైన 'నిర్మల్' గారికి దక్కింది తెలుగు లోని చక్కని రచనలను హిందీ వారికి, హిందీ సాహితీ సౌరభాలతో తెలుగువారికి పరిచయం చేయడానికి ఇతోధికమైన కృషిచేసారు

డా కర్ణరాజ శేషగిరిరావుగారు 'ఆంధ్రకీ లోకకథాయేఁ' అనే పుస్తకంలో తెలుగు జానపద గాథలు, హిందీలో వ్రాశారు 'భౌరోంకా పహాడ్' రాజశేషగిరిరావు గారి ఏకాంకికల సంకలనం.

హిందీలో పరిశోధన వ్యాసాలు వ్రాసి డాక్టరేటు పట్టం పొందిన ఆంధ్రులు దాదాపు 40 మంది ఉన్నారు వీరిలో చాలామంది హిందీలో సుప్రసిద్ధ రచయితలు. అనువాదాలు చేసి, విమర్శ ప్రధానమయిన వ్యాసాలు వ్రాసి హిందీ సాహిత్య ప్రపంచంలో పేరొందిన ఆంధ్రులు ఎంతో మంది ఉన్నారు. గ్రంథవిస్తర భీతిచే వారి సాహితీ కృషిని సవివరంగా ఇక్కడ పేర్కొనలేక పోతున్నందుకు చింతిస్తున్నాము.

ఢిల్లీ, వారాణాసి, భువనేశ్వర్, అలీగఢ్, గోరఖ్‌పూరు, పూనా, లక్నో, మున్నగు నగరాలలోనే కాక హరియాణారాష్ట్రంలో తెలుగుభాషాధ్యయన-అధ్యాపనాలకు అనువైన అవకాశాలు ఉన్నవి హరియాణా రాష్ట్రంలో తెలుగుభాషా ప్రచారం భారత ప్రభుత్వ త్రిభాషా సూత్రానికి అనుగుణ్యంగా రూపుదిద్దుకొన్నది. ఆ ప్రాంతంవారు తెలుగు భాషలోని అందచందాలను తమ మాతృభాష హిందీలోనికి అవతరింప చేసుకొనే శుభావసరం కోసం, తెలుగు భాషాభిమానులు నిరీక్షించవచ్చును.

విదేశాలనుండి అరబ్బీ-పారసీలు మాతృభాషలుగా కలిగిన ముస్లిములు రెండు మార్గాలగుండా మన దేశంలో ప్రవేశించారు. నౌకావ్యాపార సంబంధాల మూలకంగా అరబ్బులు 7-8 శతాబ్దులలో పడమటి తీరంనుంచి [illegible]

దేశంలో ప్రవేశించారు వీరి మాతృభాష, వ్యవహారభాష అరబ్బీ మనదేశంపై దండయాత్రలు చేసిన ముస్లిములు హిందూకుష్ పర్వతం కనుమలద్వారా భారత దేశంలో ప్రవేశించారు అయితే వీరి వ్యవహార భాష, సాహిత్యభాష ఫారసీ. ఆ రోజుల్లో ఫారసీ-శౌరసేనీ అపభ్రంశ భాషల సమ్మేళనంతో (హిందూ-ముస్లిం సమ్మిశ్రణం వలన) ఒకకొత్త భాష ఉద్భవించింది. ఆ భాష ప్రారంభదశలో తన జన్మస్థానంలో కాకుండా, దక్షిణ భారత దేశంలో పెంపొంద, సాహిత్యరచనకు ఎక్కువగా ఉపయోగపడింది. ఆ తరవాత మళ్ళీ ఆ భాష ఢిల్లీ-లక్నోలు చేరుకొని రెండు శతాబ్దాలపాటు సాహితీ రంగంలో ఏకచ్ఛత్రాధిపత్యాన్ని వహించింది.

దక్షిణభారత దేశంలో ఈ భాషకు దక్షినీ, రేఖ్తా అని పేర్లు ఏర్పడ్డాయి. కొంతమంది రచయితలు దీన్ని హిందవీ, హిందుయీ అనికూడా అన్నారు. ఉత్తర భారతంలో ఈ నాటి సాహిత్య భాష అయిన ఖడీబోలీతో దీనికి ఎక్కువ సంబంధం ఉంది అందుచేత ఖడీబోలీ హిందీకీ, ఉర్దూభాషకూ దక్షిణభారతంలోనే శ్రీకారం చుట్టబడిందని భాషాభిజ్ఞుల అభిప్రాయం

ఈ భాషకు అరబ్బీ-ఫారసీలతో మిక్కుటంగా సంబంధం ఉండడంతో, ఆంధ్రదేశంలో అరబ్బీ-ఫారసీ భాషల ప్రాచుర్య ప్రాభవాలను గురించి కూడా కొద్దిగా తెలుసుకోవాలి

ఖండాంతరాలలో వలసరాజ్యాలు స్థాపించుకున్న ఆంధ్రులకు నౌకాయాన సందర్భంలో అరబ్బులతో వ్యాపార సంబంధాలు ఏర్పడ్డవి అందుచేత నౌకలకు, నౌకాయాత్రలకు సంబంధించిన అనేక అరబ్బీ పదాలు తెలుగులో ప్రవేశించాయి. అయితే వాటి రూపం ఎంతగా మారిపోయిందంటే, ఈనాడు వాటిని అరబ్బీ భాషా పదాలని గుర్తుపట్టడానికి వీలులేకుండా పోయింది. అరబ్బులకు, తెలుగువారికి ఏర్పడ్డ ఈ సంబంధం నౌకా జీవనానికి మాత్రమే పరిమిత మయింది. ఈనాడు తెలుగునాటి సముద్రతీర ప్రాంతాలలోని నావికుల భాషలో వ్యవహరించ బడుతున్న పదాలు, సంస్కృత, ప్రాకృత, ద్రావిడ భాషలకు కాక అరబ్బీ, తుర్కీ భాషలకు సంబంధించినవని కీ. శే. చిలుకూరి నారాయణరావుగారు నిరూపించారు.

ముస్లిములకు అరబ్బీ ధార్మిక భాష-మత వ్యవహారాలకు సంబంధించిన భాష-కావడంతో, కొన్ని అరబ్బీ పదాలు ఫారసీద్వారా కూడా తెలుగులో చేరి-ఉండవచ్చును.

14 వ శతాబ్ది ప్రారంభంనుండే, రాజ్యవిస్తరణ కాంక్షతో మహమ్మదీయులు ఢిల్లీ చక్రవర్తుల ఆదేశానుసారంగా, అర్ధశతాబ్ది లోపల తెలుగుదేశంలోని ప్రధాన మండలాలను ఆక్రమించుకున్నారు. బహమనీరాజ్య సంస్థాపనతో అరబ్బీ-పారసీ భాషలకు రాజపోషణకూడా లభించింది. ఆనాటి మహమ్మదీయులకు వ్యవహార భాషగా ఉన్న ఫారసీ పాలకుల భాష కావడంతో, తెలుగువారిపై ప్రగాఢ ప్రభావం చూపింది. ప్రభుత్వాధికారులతో సంబంధంకల తెలుగువారికీ, రాజాశ్రయాన్ని అభిలషించే తెలుగు వారికీ ఫారసీభాష నేర్చుకోవడం తప్పనిసరి అయిపోయింది సమకాలీనులయిన తెలుగువారి కావ్యాలలో అనేక ఫారసీపదాల ప్రయోగం ఈ విషయాన్ని నిరూపిస్తున్నది

ఫారసీకి రాజభాషా గౌరవం లభించడంతో, పరిపాలన వ్యవస్థకు సంబంధించిన అనేకపదాలు, పదబంధాలు తెలుగు భాషలో చేరి మమైకం అయిపోయినవి. కబురు, చౌక్కా, రోజు, సరిహద్దు, దర్బారు, మసీదు, మజా, అత్తరు, హోదా మొదలయిన పదాలకు మూలం ఫారసీభాష అని ఆపదాలు వాడే వారిలో ఎంత మందికి తెలుసు ?

ఆ విధంగా ఫారసీనుండి వచ్చిన కొన్ని పదాలకు అర్థాలలో మార్పు వచ్చింది. ఉదాహరణకు

| | ఫారసీరూపం, అర్థం | తెలుగు |
|---|---|---|
| (ఖా) కామిందు | ఖావింద్, భర్త | భూస్వామి |
| పౌజులు | ఫౌజ్, సైన్యం | సమూహం |
| తాలీంఖానా | తాలీంఖానా, విద్యాలయం | వ్యాయామశాల |
| తనఖా | తన్‌ఖా, జీతం | తాకట్టు |
| ముద్దాయి | ముద్దయీ, | |
| కులాసా | ఖులాసా, వివరం | కుశలం |

తెలుగు పద్యరచనలో కూడా ఫారసీ ఛందోరీతులు, అంత్యాను ప్రాసల ప్రభావం కనిపిస్తుంది. కావ్యరచనలో అరబీ-ఫారసీ పద సమ్మిశ్రితమైన మణిప్రవాళశైలి కూడా ఉపయోగించబడింది. ఉదాహరణకు

1. అండాళుగారు మిమ్మర్చించు హరఖ్బు,
   నీ పూజ సేయడే నేకుబఖ్తు

2. నాకలోకము నీకు దీవాన్‌ఖానా
   నిగమ పదార్థము నీకు ఖజానా.

3. తెలిసి జేనైతి ఖదీంనుండి కోషీషు,
   పాతవైకట నేడు బిల్పరేజు.[1]

మొదటి దశలో హిందువులకు ముసల్మానులకు మధ్య వ్యవహార భాషగా ఉన్న శౌరసేనీజన్యమైన ఉర్దూ భాష ఎందరికో మాతృభాషగా రూపొందింది ఇది దక్షిణ భారతదేశంలో-ముఖ్యంగా తెలంగాణం, కర్నాటకం, మహారాష్ట్రం (పూర్వ హైదరాబాదు సంస్థానంలోని ప్రాంతాలు)-దక్షినీ భాషగా వ్యవహృతమయి, ఆధ్యాత్మిక రచనలకు, సూఫీ సిద్ధాంత ప్రచారానికి సాధనమయింది. ఈ భాష నేటి ఖడీబోలీ హిందీ, ఉర్దూలకు మూలమని భాషా శాస్త్రజ్ఞుల సిద్ధాంతం. దక్షినిలో గోల్కొండ సుల్తాను అయిన మహమ్మద్ కులీ కుతుబ్‌షా రచించిన 'కుల్లియాత్' అనే 1800 పేజీల కవితా సంకలనం చాలా ప్రసిద్ధి చెందింది ఆ సంకలనంలో కులీకుతుబ్‌షా తరచుగా హిందీ శబ్దాలు, హిందీ రూపాంతరం పొందిన ఫారసీ శబ్దాలు, అక్కడక్కడా తెలుగు శబ్దాలు వాడాడు. అంతవరకు ఆధ్యాత్మిక విషయాలకే పరిమితమయిన దక్షినీభాషలో కులీ కుతుబ్‌షా హిందూ-ముస్లిముల ఆచార వ్యవహారాలను, రమణీయ ప్రాకృతిక దృశ్యాలను కావ్యవస్తువులుగా స్వీకరించి, రచన సాగించాడు.

గోల్కొండ కుతుబ్‌షాహీల పరిపాలనా కాలంలో వజహీ, గవాసీ, ఇబన్ నిషాతీ, గులాంఅలీ, తానాషా, తబయీ అనేవారు దక్షినీభాషలో సుప్రసిద్ధ కవులు. 1630 ప్రాంతంలో పాలవేకరి కదిరీపతి 'శుకసప్తతి' రచించాడు. 1659లో గవాసీ దక్షినీ భాషలో 'తూతీనామా' రచించాడు. 'తూతీనామా'. 'శుకసప్తతి' లలో చాలా సామ్యం కనిపిస్తున్నదని దక్షినీభాషా-సాహిత్యాలను గభీరంగా తరచి, పరిశోధించిన డా. శ్రీరామశర్మగారు వ్రాసారు.

---

1. తెలుగుపై అరబ్బీ-పారశీకముల ప్రభావము-డా. కె. గోపాలకృష్ణరావు.

ఈ దక్షినీ యొక్క పరిష్కృత రూపమే ఉర్దూ. ఈ పరిష్కారం అరబ్బీ-ఫారసీ భాషా-సాహిత్య సంప్రదాయాలను అనుసరించి జరగడంతో, ఉర్దూ భాషా-సాహిత్య సంప్రదాయాలపై ఆయా ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది

గోల్కొండ రాజ్య పతనానంతరం, ఆసఫ్‌జాహీల కాలంలో కూడా దక్షినీ రచనలకు ప్రోత్సాహం లభించింది. ఔరంగాబాదు శాసకుడయిన వలీఉల్లా 'వలీ' అనే పేరిట చక్కటి రచనలు చేశాడు వలీకి దక్షినీ (రేఖ్తా) భాషను ఢిల్లీకి తీసుకో వెళ్ళిన గౌరవం దక్కింది అక్కడ ఆ భాషను 'ఉర్దూ' అని వ్యవహరించారు ఉర్దూలో గద్యరచనకు శ్రీకారం చుట్టినవాడూ వలీయే

1890 ప్రాంతాలలో హైదరాబాదులో ఉర్దూ రాజభాషగా వ్యవహృతం కాసాగింది ఆ తరవాత ఉస్మానియా విశ్వవిద్యాలయ స్థాపనానంతరం, ప్రభుత్వోద్యోగాల నాశించేవారు, ఉన్నత విద్యాభ్యాసం చేయగోరేవారు తప్పనిసరిగా ఉర్దూ నేర్చుకోవలసి వచ్చింది. దానిచే సామాన్య జన వ్యవహారానికి ఉర్దూతో పరిచయం కలిగి ఉండడం అవసరమైంది. తెలంగాణం నడిబొడ్డున ఉన్న హైదరాబాదు ఉర్దూకు ప్రధాన కేంద్రం కావడంతో, తెలుగు భాషా సాహిత్యాలపై ఉర్దూ బాష, సాహిత్య సంప్రదాయాల ప్రభావం పడడం సహజమేకదా !

పరిపాలనా విధానంతోనూ, ప్రభుత్వంతోనూ పరోక్షంగాను, ప్రత్యక్షంగాను సంబంధం ఉన్న గ్రామాధికారులు, వకీళ్ళు, అధికారులు తమ మాతృభాష తెలుగే అయినా ఉర్దూ-ఫారసీ భాషలలో మంచి పాండిత్యాన్ని గడించి, నాటి రాజకీయ, ప్రజాజీవితాలతో ఎంతో పలుకుబడిని సంపాదించుకున్నారు. వారు స్వాతంత్ర్యోద్యమంలో ప్రజల్లో చైతన్యం జాగరితం చేయడానికి ఉర్దూ భాషను సాధనంగా వినియోగించుకున్నారు. అయితే ఉర్దూ-ఫారసీ భాషలలో తెలుగువారు సాహిత్య సృష్టి చేసిన సందర్భాలు క్వాచిత్కంగానే ఉన్నా, అప్పటి హైదరాబాదు రాష్ట్రంలో తెలుగువారు ఉర్దూ ఫారసీ భాషల ద్వారా సాధించిన సిద్ధులు చెప్పుకోతగ్గవే. అటు ప్రభుత్వాన్ని, ఇటు అక్షరాస్యులయిన ప్రజలను ఉర్దూ భాషా పాండిత్యం ద్వారా ప్రభావితం చేయడానికి వారు ప్రయత్నం చేశారని చెప్పడంలో ఎలాంటి సందేహమూ లేదు.

ఉర్దూలో పత్రికా రచయితలుగా, పత్రికా నిర్వాహకులుగా వన్నెకెక్కిన ఆంధ్రులలో శ్రీమందుముల నరసింగరావు ('రయ్యత్'), బండారు శ్రీనివాసరావు

('రహనుమా'), వెంకట లక్ష్మారెడ్డి (ముహిబ్బెవతన్'), లక్ష్మీనారాయణ ('షరారే') ప్రభృతులు చెప్పుకోతగ్గవారు. దోమకొండ సంస్థానాధీశ్వరులయిన రాజేశ్వరరావు గారు ఉర్దూ-హిందీ, హిందీ-ఉర్దూ నిఘంటువులేకాక, మహాభారత, రామాయణా లను చక్కటి ఉర్దూ గద్యంలో అనువదించారు వారు ఉర్దూలో దాదాపు 35 రచనలు చేశారట వారు ఉర్దూ సామెతల సంకలనం కూడా తయారు చేశారు.

ఉర్దూలో కవిత్వం చెప్పిన ఆంధ్రులు పలువురున్నారు. వారిలో పల్లెర్ల శ్రీనివాసరావు 'ఫక్ర్', కొడంగల్ వాస్తవ్యులయిన జకీ, వరంగల్లు వాస్తవ్యులయిన కాళోజీ రామేశ్వరరావు 'షాద్', ఉదయగిరి శేషగిరిరావు మొదలయిన వారు పేర్కొనదగ్గవారు. 1930 లోనే ఫక్ర్‌గారు 'బేతాజ్ బాద్‌షా' (ముకుటం లేని చక్రవర్తి) అనే శీర్షికన నెహ్రూపండితుణ్ణి వర్ణించిన కవిత పలువురి ప్రశస్తి పొందింది. పల్లెర్ల హనుమంతరావుగారు ఉర్దూ గద్యరచనలో సిద్ధహస్తులు. జనార్దన రావు దేశపాండే చక్కటి ఉర్దూలో రచనలు సాగించారు.

హరికథా పితామహులయిన ఆదిభట్ల నారాయణ దాసుగారు కూడా ఉర్దూ-పారసీ భాషలు చక్కగా నేర్చుకొని, ఆయా భాషలలో రచనలు సాగించారట. వారు మణిప్రవాళ శైలిలో రచించిన సీసపద్యమొకటి 'ఆంధ్ర రచయితలు' అనే గ్రంథంలో ఉట్టంకించబడింది.

## పీఠికాపుర వర్ణనము

భ్రాజతే కుక్కుటేశ్వర మాధవాలయాభ్యాం
ఘనారూఢ సౌధాంతరేణ
హాసిల్ హమీష జహాన్‌తాజ్ నమూన
బహిష్మ త్తుమ్మసాపిర్చి హిరిసాల
రావుసూర్యారావు రాజా బహద్దర్ది
చారిటి బిల్లూల్పెర్రి జెంట్స్ ఎరెవ్రి
చదువుల పుట్టిల్లు చల్వతెమ్మర జల్లు
మేల్నొల్లు పొగడిక మీరజెల్లు

మేటిపంటల టెంకి కల్మి మెడలంకి
బెష్టు దే నిన్గొడావరీ యీస్ట్ దిసీజె
మర్చుపీర్వ జవాన్ జవాల్ మీర్జనాన
పీరికాపురమేవ త్రివిష్టప మిహ[1].

ఉర్దూ రచనలను తెలుగులో అనువదించిన వారిలో శ్రీ దాశరథి, సదాశివ మొదలగువారు పేర్కొనదగిన రచనలు చేశారు డా. కె. గోపాలకృష్ణరావుగారు ఉర్దూ-ఫారసీలను గురించి, తెలుగులో చక్కటి గ్రంథం వెలయింప చేశారు.

శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు డా జీనత్ సాజిదాతో కలిసి తెలుగు వాఙ్మయ చరిత్రను 'తారీఖే తెలుగు అదబ్' అనే పేరిట రచించి, తెలుగు సాహిత్య మకరందాన్ని, ఉర్దూ భాషీయుల కందచేశారు.

అచ్చ తెలుగులో కావ్యరచన చేయించి, ఆ కృతులను స్వీకరించిన గౌరవం కుతుబ్‌షాహీ సుల్తానులకు, వారి సామంతులకు దక్కింది

అద్దంకి గంగాధరకవి (16 వ శతాబ్దం) 'తపతీ సంవరణోపాఖ్యానము' అనే కావ్యాన్ని 'ఇభరాముడు', 'మల్కిభరాముడు' అని ప్రసిద్ధి కెక్కిన ఇబ్రహీమ్ కులీ కుతుబ్‌షాకు (1550-1580) అంకితం చేశాడు. ఈసుల్తాను తెలుగు భాషతో చక్కని పరిచయం కలిగిఉండి, తెలుగుకవులకు, సాహిత్యపరులకు ఆశ్రయం ఇచ్చాడు. ఆసూరి మరింగంటి సింగరాచార్యులు 'దశరథరాజ నందన చరిత్ర' యను నిరోష్ఠ్య కావ్యం రచించి, ఇబ్రహీమ్‌కు అంకితం చేశాడు.

పొన్నగంటి తెలగనార్యుని 'యయాతి చరిత్ర'కు కృతిపతి అమీన్‌ఖాను. ఇతను ఇబ్రహీంషా సర్దారులలో ఒకడు. పొట్లచెరువునకు గ్రామాధిపతి 'యయాతిచరిత్ర' అచ్చ తెలుగుకావ్యాలలో ఆదికావ్యమై, తరవాతి వానికి ఒరవడి పెట్టినది.

ఇబ్రహీం తృతీయపుత్రుడు మహమ్మద్ కులీ కుతుబ్‌షా 'మానీ' అనే కవితా నామంతో ఫారసీ-ఉర్దూభాషలు రెండింటిలో రచనలు చేశాడు. ఈతనికి తెలుగుభాష యందు ప్రవేశముండి, తెలుగులోకూడా కవితలు అల్లినట్లు చరిత్రకారులు వ్రాశారు.

1. ఆంధ్ర రచయితలు : శ్రీ మధునాపంతుల సత్యనారాయణగారు.

కూచిపూడి నృత్య కళారీతుల వైశిష్ట్యాన్ని గుర్తించి, కూచిపూడి కళాకారులను సత్కరించిన, సమాదరించిన ప్రభువు గోల్కొండ నేలిన అబుల్ హసన్ కుతుబ్‌షా.

ఆధునిక యుగంలో మెహిఉద్దీన్, చాంద్‌బీబీల గర్భవాసాన జనించిన ఉమర్ అలీషా (1885-1945) తెలుగు భాషలో పాండిత్యం గడించి, తెలుగులో కవిత్వం వ్రాసి పేరొందిన ముస్లిములలో అగ్రగణ్యులు తమ 14 వ ఏటనే ధారాళంగా కవిత్వం చెప్పారు మాతృభాష ఉర్దూ అయిననూ తెలుగుభాషలో సరసంగా కవిత్వం చెప్పి రసికులను మెప్పించిన సమర్థులు. వీరు రచించిన తెలుగు గ్రంథాలు ఏబదివరకు ఉన్నవి

ఆంధ్రప్రాంతంలో వ్యవహారంలో ఉండడంతో, ఉర్దూ(వాడుక) భాషా-సాహిత్యాలపై, ఉచ్చారణ, పదాలు, పదబంధాలు, వాక్యనిర్మాణం, సామెతలు మొదలయిన వాటిపై తెలుగుభాష ప్రభావం స్పష్టంగా గోచరిస్తుంది.

కరేపాక్ (కరివేపాకు), కుప్ప, చెప్పల్, కట్ట, దొర, బొట్టు, చిర్‌దండీ (చిరుతిండి), చిల్లర్, పుట్టీ, పద్దల్ (పడుదల, బేరం సానుకూలపడటం), దండ్ (దండగ), చక్కాదహీ (చెక్కపెరుగు), పక్కాపండు (బాగాపండినపండు), గంపా-గుత్తా (మొత్తంగుత్తా Contract), మందం, ఎట్టీ (వెట్టి), బువ్వ మొదలయిన పదాలు, చెంబూహోనా (దండగకావడం), కుప్పాహోనా (వ్యర్థంకావడం లేక పాడయిపోవడం) మొదలయిన పదబంధాలు ఉర్దూ భాషలో నిత్యవ్యవహారంలో ఉన్నవి.

చెమార్‌కే దేవ్‌కో చెప్పల్‌కీ పూజా (మాదిగదేవుడికి చెప్పులతోపూజ అనగా ఏటువంటి వాడికి అటువంటి విధంగానే బుద్ధిచెప్పాలి), ఖానేకోనహీఁ, ఎల్లీకో బులారహేహైఁ. (తింటానికిలేదు,ఎల్లిని రమ్మంటున్నాడు అనగా మింగడానికి మెతుకులేదు, మీసాలకు సంపెంగనూనె అని భావం) లాంటి సామెతలుకూడ ప్రచారంలో ఉన్నవి

ఉర్దూ వాక్యనిర్మాణంలోకూడా తెలుగువాక్య నిర్మాణ ప్రభావం కనపడుతుంది. 'చెప్పమని చెప్పాడు' అనడానికి ఉర్దూలో' 'బోల్కే బోల్తేహై' అని, 'కావలెనని (రావలెనని) రాతేడు' అనడానికి 'హోనాబోల్కేనహీఁ ఆయా' అని,

'ఊరికే కూర్చో' అనడానికి 'చుప్కే బైఠో' అని వాడుతున్నారు తెలుగు వాక్య రచనా ప్రభావంతో వచ్చిన ఇటువంటి వాక్యరచన దక్షిణ ఉర్దూలోను, వ్యావహారిక ఉర్దూలోనె వ్యవహారంలో ఉన్నది

దక్షిణాదిరాష్ట్రాలన్నింటిలోకి ఆంధ్రరాష్ట్రంలో హిందీకి వ్యతిరేకత లేకపోవడానికి, హిందీభాషా ప్రచారానికి అనుకూల్యం ఏర్పడి ఉండడానికిగల ముఖ్య కారణాలలో ఉర్దూభాషా పరిచయ మొకటని చెప్పాలి పరిష్కృతమయిన హిందీలో-గ్రంథరచనకు ఉపయోగపడుతున్న హిందీభాషలో-సంస్కృతపదాలు హెచ్చు, సంస్కృతం వైపు మొగ్గుహెచ్చు తెలుగుభాషలో సంస్కృత శబ్ద బాహుళ్యం ఉండనే ఉన్నది. దానికితోడు ఉర్దూభాషతో కొద్దో-గొప్పో పరిచయం కలిగి ఉండడంచేత, ఆంధ్రులు హిందీభాషను అతి త్వరలో నేర్చుకోగలరు ఈ మధ్య నాగపూరులో జరిగిన విశ్వహిందీ సమ్మేళనంలో పాల్గొన్నవారిలో ఉత్తర ప్రదేశ్ తరవాత ఆంధ్రప్రదేశ్ నించివచ్చిన ప్రతినిధులసంఖ్యయే ఎక్కువ.

అనేక కారణాలవల్ల ఏర్పడ్డ పరస్పర సంబంధ బాంధవ్యాలతో తెలుగు భాషా సాహిత్యాలపు, ఉత్తరభారతభాషా సాహిత్యాలలో అన్నింటికంటె, హిందీ-ఉర్దూ సాహిత్యాలతో ఏర్పడ్డ పరస్పర ప్రభావం చెప్పుకోతగ్గది హిందీ-ఉర్దూల తరవాత ఉత్తర భారతభాషలలో తెలుగుసాహిత్యంపై ఎక్కువ ప్రభావం చూపించిన భాష బెంగాలీభాష బంకించంద్ర ఛటర్జీ, పాంచకడీదేవ్ శరత్‌బాబు ప్రభృతుల నవలల తెలుగు అనువాదాలు, విశ్వకవి రవీంద్రుని రచనలకు తెలుగు అనువాదాలు, శాంతినికేతనంలో అధ్యయనం మొదలయినవి తెలుగువారి భావప్రపంచాన్ని అత్యధికంగా ప్రభావితం చేశాయని చెప్పడంలో అతిశయోక్తి లేదు. వెంకట పార్వతీశ కవుల 'ఏకాంతసేవ'ను గురించివ్రాస్తూ శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి గారు 'వంగభాషకు రవీంద్రుని గీతాంజలి యెట్టిదో, మన యాంధ్రమున కీ మహాకవుల-భక్తుల యేకాంతసేవ యట్టిది' అని అన్నారు. తెలుగులో వచ్చిన భావకవిత్వానికి, మర్మకవిత్వానికి రవీంద్ర భావాంజలియే మూలమని చెప్పవచ్చును. కథలలో, నవలలలో మధ్యతరగతి వారి సమస్యలు, సమాజంలో స్త్రీ సంబంధమయిన సమస్యల చిత్రణపై శరత్ నవలల ప్రభావం నిర్వివాదం.

మనకు తెలుగులో గ్రాంథిక, వ్యావహారిక భాషాభేదం ఉన్నట్టుగానే బెంగాలీలో సాహిత్య, కథ్య భాషాభేదం ఉన్నది.

[8]*

బెంగాలీ భాషలో మన బొబ్బిలికథవంటి 'చౌధరీల్ లడాయీ' చాలా ప్రసిద్ధి వహించింది.

ఆధునిక యుగంలో ఆంధ్రదేశాన్ని ఉర్రూత లూగించి సంఘ సంస్కరణో ద్యమాన్ని ప్రభావితం చేసినవి వంగదేశంలో ఉద్భవించిన బ్రహ్మసమాజం లాంటి ఉద్యమాలే. పాటపర్తి నరసింహంగారు 'భక్తాంజలి' అనే పేరిట బ్రహ్మసమాజ ప్రసంగాలను అనువదిస్తే, మన్నవ బుచ్చయ్య పంతులు 'ఇండియన్ రిఫార్మర్' అనే పత్రిక స్థాపించి, బ్రహ్మమత ప్రచారం చేశాడు. కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఈ సంఘసంస్కరణోద్యమానికి సాహిత్యాన్ని సాధనంగా చేసుకున్న విషయం నలుగురు ఎరిగినదే. వీరేశలింగంగారి శిష్యులలో ఆదిపూడి సోమనాథరావు మొదట్లో బ్రహ్మసమాజ ప్రచారంచేసి, ఆ తరవాత ఆర్యసమాజంలో చేరి, స్వామి దయానంద రచించిన 'సత్యార్థ ప్రకాశిక' ను తెలుగు చేశారు.

బెంగాలు విభజన, జాతీయోద్యమంగామారి, భారతదేశంలోని ప్రతిరాష్ట్రాన్ని ప్రభావితంచేసిన సంగతి చరిత్రప్రసిద్ధం. శ్రీ ముట్నూరికృష్ణారావుగారు బెంగాలు వెళ్ళి, అక్కడి పరిస్థితులను స్వయంగాచూచి, ఆ ఉద్యమం ఆంధ్రదేశంలోకూడా వ్యాపిస్తే బాగుంటుందని భావించారు. 1907లో బిపిన్‌చంద్రపాల్‌గారి ఆంధ్రదేశ పర్యటనతో సమస్త ఆంధ్రదేశంలో ఆ ఉద్యమం వ్యాపించింది. ఆ ఉద్యమ ఫలితంగా ఏర్పడ్డదే బందరులోని జాతీయకళాశాల.

బెంగాలునుంచి జాతీయకళాశాలకు ప్రమోద కుమారచట్టోపాధ్యాయ అనే చిత్రకారుడు వచ్చాడు. అడివి బాపిరాజు, దామెర్ల రామారావు ప్రభృతులయిన చిత్రకారులంతా ఆయనకు సాక్షాత్తుగాగాని, పరంపరగాగాని శిష్యకోటిలోని వారు.

ఈ జాతీయోద్యమం, జాతీయ విద్యోద్యమం కాలక్రమాన ఆంధ్రోద్యమంగా పరిణమించినవి. జాతీయోద్యమ ప్రభావంవల్ల పట్టాభిసీతారామయ్య, కళా వెంకట్రావు, యన్. జి రంగా, దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు, ఆంధ్రకేసరి ప్రకాశం పంతులు, ఆంధ్రరత్న దుగ్గిరాల ప్రభృతులు యావద్భారత ప్రశస్తి గడించుచున్నారు.

ఆంధ్రదేశానికి చెందిన హోలియ (Holia) అనే గ్రామంలో 1607లో జన్మించిన శివరాముడనే యోగీశ్వరుడు రామానంద సరస్వతి అనే పేరుతో, వంగదేశంలో ప్రఖ్యాతి వహించారు. ఆయన శిష్యులు-ప్రశిష్యులు 'తైలంగ [illegible]' అనే

పేరుతో ఒక సంస్థను స్థాపించి, వారి ఉపదేశాలను ప్రచారంచేస్తున్నారు. 1975, జనవరి 24 నుండి 27 తేదీలలో తైలంగస్వాములవారి 369వ జన్మదినోత్సవాన్ని ఘనంగా జరుపుకున్నారు.

పంచద్రావిడులలో ఒకరైన మహారాష్ట్రులు, ప్రాచీన ఆంధ్రదేశచరిత్రలో ప్రముఖస్థానం కలిగి ఉన్నారు హాల సాతవాహనుడు తననాటి ప్రాకృతాన్ని రాజ భాషగా గౌరవించాడు దీనినే తర్వాతివారు మహారాష్ట్రీ ప్రాకృతమన్నారు. గాథా సప్తశతిలో ఆంధ్రజీవనమే వర్ణించబడ్డది. కనుకనే ఎన్నో తెలుగుపదాలు గాథాసప్త శతిలో చేరాయని తిరుమల రామచంద్రగారన్నారు.[1]

పుట్టపర్తి నారాయణాచార్యులుగారన్నట్లు "నేటి మరాఠీకి 'మహారాష్ట్రీ' ప్రాకృతమే మూలభాష. కనుక ఆ వాఙ్మయమునకు పురుడుతీర్చిన అదృష్టము పూర్తిగా కాకున్నను సగపాలునకు పైగా మనది."

మహారాష్ట్ర దేశంలో పాండురంగనికున్న మహత్త్వము మరో దేవునికి లేదు. శ్రీకృష్ణదేవరాయల కాలంనాటికి పాండురంగడు విద్యానగరాన్నికూడా బాగా ఆకర్షించాడు. రాయలు పండరియాత్రకూడా చేశాడట అళియరామరాజు తనభక్తితో పాండురంగని విద్యానగరానికి తీసుకోవచ్చాడని, కవిభక్తుడయిన ఏకనాథుని ముత్తాత అయిన భానుదాసుడువచ్చి విఠలుణ్ణి వెనక్కు తరలించి తీసుకోపోయాడని అంటారు. పండరినాథునిపట్ల తెలుగువారికున్న ఈ అభిమానం, భక్తిప్రపత్తులు 'పాండురంగ మాహాత్మ్యం'లో కన్పిస్తవి.

'దాస విశ్రామధామ'అనే మరాఠీ గ్రంథంలో మహాకవి పోతన కథ కూడ వర్ణించబడి ఉన్నది.

శివాజీకి గురువైన సమర్థ రామదాసు ఆంధ్రుడని కొంతమంది మహారాష్ట్ర పండితుల అభిప్రాయం. ఆయన శిష్యుడయిన ఉద్ధవగోస్వామి ఆంధ్రుడని ప్రతీతి

శివాజీకాలంలో ఆంధ్ర మహారాష్ట్ర దేశాలకు బాగా సంబంధాలు ఏర్పడ్డవి. ఆంధ్రదేశంలోకాక దక్షిణదేశంలో రాజ్యంచేసిన మహారాష్ట్ర భూపతులు తెలుగు

---

[1] గాథాసప్తశతిలో తెలుగుపదాలు-భారతి, 1948. మార్చి. (సర్వధారి, చైత్రం); **Telugu words in Gatha Saptasati-Summary of Papers, International Orientalists, Conference. New Delhi-1965.**

కవులను పోషించడమేకాక స్వయంగా తెలుగులో రచనలుచేశారు. తంజావూరు నేలిన అభినవభోజుడుషాహజీ మహరాజు ఆంధ్రభాషకుచేసిన సేవ అవిస్మరణీయం కదా ! ఆయన ఆస్థానంలో సంస్కృతాంధ్ర తమిళకవులు చాలామంది ఉండే వారట !

శివాజీకాలంలో మన బుర్రకథలవంటి 'పవాడాలు' లేక 'పువ్వాడాలు' మహారాష్ట్రదేశంలో బాగా ప్రచారంలోకి వచ్చినవి

కాకతీయుల ఇలువేల్పయిన ఏకవీరాదేవిని ఏకనాథుడు ప్రస్తుతించాడు.

ఆధునికయుగంలో ఎన్నో మరాఠీ రచనలకు తెలుగు అనువాదాలు వచ్చినవి హిందూవీరుల సాహసకృత్యాలని, చరిత్రలో హిందూ స్వర్ణయుగాన్నిచాటే కథలు మరాఠీ ప్రభావంతో తెలుగులోవచ్చాయి వీరసావర్కరు రచించిన 'భారత ప్రథమ స్వాతంత్ర్యయుద్ధం' ఆంధ్రులను ఉత్తేజపరచిన రచన

మరాఠి నవలలను ఆంధ్రీకరించినవారిలో వాసుదేవరావు యన్. జగన్నాథ్, పి వి. నరసింహారావు ప్రముఖులు

మరాఠీలో మౌలికంగా రచనలుచేసిన వారిలో కీ శే కొమర్రాజు లక్ష్మణ రావు పంతులుగారు గణనీయులు వారు మరాఠీలో దాదాపు 150 వ్యాసాలు వ్రాశారు. మోరోపంతు మరాఠీలో రచించిన మహాభారతాన్ని పరిష్కరించి ప్రచురించారు వారు 'మహారాష్ట్రేతిహాసిక పరిశోధకమండలి'తో వాదించి, నాసికవద్ద ఉన్నది పంచవటి కాదనీ, భద్రాద్రివద్ద ఉన్నదే సిసలయిన పంచవటి అనీ నిరూపించారు.

'సీతారామాంజనేయ సంవాదమ'నే వేదాంత గ్రంథాన్ని రచించిన పరశు రామపంతుల లింగమూర్తిగారు ఆంధ్రదేశంలో స్థిరపడిపోయిన మహారాష్ట్ర వంశ సంజాతులు.

కాళోజీ, హర్కారే అనే ఇంటిపేర్లు గలవారు తెలుగుదేశంలో స్థిరపడిపోయిన మహారాష్ట్రులు. కాళోజీ నారాయణరావుగారు ఆధునిక తెలుగు కావ్య జగత్తులోసుప్రసిద్ధులు.

ఈ శతాబ్ద ప్రారంభంలో ప్రకాశానందస్వామి అనే ఆంధ్రుడు గుజరాతు ప్రాంతంలో చాల ప్రసిద్ధికెక్కాడు. 'వారాలాపం'. అనే పేరిట ఆయన ప్రవచన సంకలనాలు అచ్చుఅయినవి.

తెలుగువారు ఇతర ప్రాంతాలకు, ఇతరదేశాలకు వెళ్ళి, అక్కడ స్థిరపడి పోయి, అక్కడి వారితో కలిసిమెలిసి పోయారు.

కంసుని ఆస్థానంలో ఉండి శ్రీకృష్ణునితో ముష్టియుద్ధం చేసిన చాణూర-ముష్టికులు ఆంధ్రులేనట. కాని ఇలా ఇతర ప్రాంతాలలో స్థిరపడిపోయిన తెలుగు వారికి ఆంధ్రప్రాంతంతో సంబంధ బాంధవ్యాలు లేకపోవడంతో, వారు ఆంధ్రులని తెలియకుండా పోతున్నది రాజస్థానులో 'స్వామి' అన్న పేరుగల వారి పూర్వీకులు, మహారాష్ట్ర, మధ్యప్రదేశాల్లో 'తైలంగ్' అన్న పేరుగలవారి పూర్వీకులు తెలుగు వారేనట మహారాష్ట్రంలో జ్యోతిష్కులకు, ఉత్తరప్రదేశ్‌లో సైనికులకు, పోలీసు లకు, పంజాబులో వస్తాదులకు తెలంగాలు అనిపేరట. బహుశ వీరి పూర్వీకులు తెలుగువారై ఉండవచ్చు కాశీలో సుప్రసిద్ధ వీర శైవపీఠం స్థాపించిన చిదిరేమఠం వీరభద్రశర్మగారు తెలుగువారు

కాశీలోని వ్యాకరణ పండితులలో సుప్రసిద్ధులయిన శేషంవారు తెలుగువారే.

ఈ విధంగా ఇతర ప్రాంతాలలో స్థిరపడి, యావద్భారత కీర్తివహించిన ఆంధ్రులలో సి వై. చింతామణి, వారి పుత్రుడు సి బాలకృష్ణరావు కుమార్తె శ్రీమతి డాక్టర్ మోహినీరావు, కోటంరాజు రామారావు, నాయుడమ్మ, సి. కె. నాయుడు, విజ్జీ, ప్రభృతులు ప్రఖ్యాతులు

యల్లాప్రగడ సుబ్బారావు, సూరి భగవంతం, కోడి రామమూర్తి, మోటూరి సత్యనారాయణ, వేమూరి ఆంజనేయశర్మ, డా. ఇలపావులూరి పాండురంగారావు, యస్. రాధాకృష్ణన్, వి వి. గిరి మొదలయిన ఆంధ్రులు తమ ప్రతిభావైదుష్యా లతో సమస్త దేశాన్ని ప్రభావితం చేసినవారు.

ఈ ప్రకారంగానే ఇతర ప్రాంతాలనుండికూడా ప్రజలు వచ్చి ఆంధ్రదేశంలో స్థిరపడిపోయారు మన రాష్ట్రంలో బొందిలీలు అనబడేవారు 'బుందేల్ ఖండ్' నుండి వచ్చి ఇక్కడ స్థిరపడిపోయారు పంతులవారు, వఝులవారు, పండావారు, చతుర్వేదులవారు, ద్వివేదులవారు, ఇతర ప్రాంతాలనుండి వచ్చి ఆంధ్రదేశంలో స్థిరపడిపోయిన వారని కొంతమంది అభిప్రాయం.



# ముగింపు మాట

భారతదేశంలో ఎన్నో భాషలు ఉన్నవి; వాటిలో కొన్నిటిలో సమృద్ధ మయిన వాఙ్మయం ఉంది, వాఙ్మయరచన జరుగుతున్నది. ఈ భాషలు మాట్లాడే వారిని ఏకసూత్ర నిబద్ధం చేసింది సంస్కృతం అయితే అది సాంస్కృతిక మయిన సమైక్య భావం ఆంగ్లేయులు వచ్చిన తరవాత దేశంలో రాజకీయమయిన సమైక్యం ఏర్పడింది. ఈ కారణాలుగా భారతీయ భాషలలోని సాహిత్యాలలో మొదటినుంచి సమానమయిన సాహిత్య ప్రవృత్తులు కనిపిస్తని.

దైనందిన జీవితానికి భాషకు సన్నిహిత సంబంధం ఉండితీరాలి అప్పుడే భాష కొత్త చివుళ్ళను వేస్తుంది, కొత్త సౌరభాలను గుబాళిస్తుంది దేశప్రజలంతా ఒకే రాజ్యాంగానికి బద్ధులయి, ఒకే ఆదర్శ శిఖరాన్ని అందుకోవడానికి మహోద్య మాన్ని నిర్వహిస్తున్నపుడు పరస్పర భావసమ్మేళనం, పరస్పర భాషా సమ్మేళనం సహజంగానే జరుగుతవి ఈ సందర్భంలో భాషల పరస్పర ప్రభావం అనివార్య మయి పోతుంది.

తెలుగువారు కవితాప్రియులు. దేశంలోనేకాదు, జగత్తులో ఎక్కడనైనాసరే, కొత్తదేదైనా కనిపిస్తేసరి, తెలుగువాళ్ళు దాన్ని సొంతం చేసుకునేందుకు పరవళ్ళు తొక్కుతారు. కొంగ్రొత్త రుచులను ఆస్వాదించాలనే కుతూహలంతో ఎన్నో కొత్తవేషాలను, కొత్తరుచులను, కొత్త సాహిత్య ప్రక్రియలను, కొత్త ఆచారాలను అలవరచుకుంటారు. ఈ అలవాటే తెలుగువాణ్ణిఅధునాతన పౌరునిగా తీర్చి దిద్ద గలుగుతున్నది.

భారతీయ భాషల పరస్పర ప్రభావం, ఒక మహా స్రవంతిలా నిండుగా, గంభీరంగా, కూలంకషంగా, నిన్నటిదాకా నిరర్గళంగా ప్రవహిస్తూ వచ్చింది. భారతీయులంతా ఆ పునీత నదీజలాల్లో స్నాతులయి, ఆరోగ్యాన్ని సంపాదించుకొన గలరు. ఈ భాషలు సమైక్య భావానికి, అవరోధాలుగా కాక, సుమసేతువు లుగా వర్ధిల్లినవి.

భారతదేశం విభక్తం కావడం భారతీయుల మనస్సులను కలచి వేసింది.

ఈ విభజనతో ఆగక, భాషాప్రయుక్తంగా దేశ పునర్విభజన కావడం, పరిపాలన దృష్టితో ఎంతవరకు సముచితమో చెప్పలేముకాని, దేశీయుల మనస్సులను సంకుచిత పరచడంతో తోడ్పడుచున్నదేమో అనే అనుమానానికి తావిస్తున్నది. నదీజలాల విషయంలో, కొన్ని ప్రాంతాల విషయంలో ఇంకా వివాదాలు కొనసాగుతూనే ఉన్నవి ఉద్యోగాలు, బోధనభాష మొదలయిన జాతీయ ప్రాముఖ్యంకల విషయాలలో, ఏ రాష్ట్రానికి ఆ రాష్ట్రం గిరిగీసుకొని, రకరకాల శాసనాలను అమలు పరచు కుంటున్నది. దేశంలోని మేధావులంతా కూడి దేశీయ సమస్యలను సమాలోచించుకునేందుకు వీలయిన భాషను పెంపొందింపుకునేందుకు మారుగా, మేధావులంతా తమతమ ప్రాంతీయ భాషలకే తమ తెలివితేటలను పరిమితం చేసుకుంటున్నారు. ఇతర భాషలపట్ల నిన్న ఉన్న సమరసభావం, సహన శీలత నేడు కనిపించడం లేదు ప్రాంతీయతత్త్వాలు భాషలను ప్రాతిపదికగా చేసుకొని, విచ్ఛిన్న ధోరణులు విజృంభిస్తూ ఉండడం సమైక్య భావ ప్రసరణానికి ఎంతో ప్రమాదకరంగా కనిపిస్తున్నది. సాంస్కృతికంగా ఒకటిగా ఉన్న భారతీయులు రాజకీయాల దాడికి విడిపోవడం, తమ శక్తియుక్తులను నిరర్థకం చేసుకోవడమే కాగలదు

తెలుగుతనం భారతీయతలో ఒకభాగం. తెలుగు భారతీయుల మణిహారంలో ఒకమణి. ఒక సమైక్య శక్తిలో భాగంగా తెలుగు, తెలుగుప్రజలు దేశాభ్యుదయానికి కృషిచేయగలరని, ఇతర భాషాసాహిత్యాలు, చరిత్ర రుజువుచేస్తున్నవి. రాజకీయాలు మనస్సులను విడదీస్తే, సాహిత్యం హృదయాలను కలుపుతుందనే యాథార్థ్యాన్ని ఈ మా పరిశీలన దిఙ్మాత్రంగా నైనా తెలుపగలిగితే, మా కృషికి కృతార్థత చేకూరుతుందని ఆశిస్తున్నాము.



# పరామర్శగ్రంథాలు


1 Contemporary Indian literature Sahitya Akademi, New Delhi.

2 Literature in Modern Indian languages-Edited By Dr V K. Gokak

3. హిందీ సాహిత్యకోశ్ (మొదటిభాగం)-సం. డా ధీరేంద్రవర్మ.

4 దక్షినీ హిందీ కా సాహిత్య డా శ్రీరామశర్మ.

5 తెలుగుపై ఉర్దూ, పారసీకముల ప్రభావం-డా కె గోపాలకృష్ణారావు.

6 తెలుగు వాఙ్మయము సంగ్రహచరిత్ర - సం. కె. వి గోపాలస్వామి.

7. తెలుగుభాషీ హిందీ నాటక్‌కార్ పురుషోత్తమకవి - డా. భీమసేన్ 'నిర్మల్'.

8 National Integration Publication Series The Institute of Indo-Middle East cultural studies, Hyderabad.

9. ఆంధ్రవాఙ్మయచరిత్ర సంగ్రహము. కె. వెంకటనారాయణరావు.

10 శివరాత్రిమాహాత్మ్యము. సం. డా. బి రామరాజు.

11. సారస్వత నవనీతము : దేవులపల్లి రామానుజరావు.

12. మాధ్యమ్ (ఆంధ్ర విశేషాంక్) - సం. సి. బాలకృష్ణరావు.

13. అఖిలభారత తెలుగు సాంస్కృతిక వారోత్సవముల ప్రత్యేక సంచిక.

14. విజ్ఞాన సర్వస్వము - మూడవభాగము.

15. ,, ,, ఆరవభాగము

16. నవ్యాంధ్ర సాహిత్యవీథులు - కురుగంటి సీతారామయ్య.


*